# కథానికలు

రచయిత :
సంగీత సాహిత్య కళానిధి
కేతవరపు రామకృష్ణశాస్త్రి

పబ్లిషర్సు:
మారుతిరామా అండ్ కో., విజయవాడ
విద్యావిషయిక ప్రచారకులు

హక్కులు మావి] 1954 [వెల 0-12-0

# రైలు ప్రయాణం

ఆరోజున మంచి వర్షంకురుస్తోంది. తప్పనిసరిగా ఊరికి వెళ్ళవలసిన అవసరం వచ్చింది. బట్టతడుపు జల్లులో బయలుదేరి రైలుస్టేషనుకు తొందరగా నడిచి వెళ్ళేను. వర్షంకూడా తోడైంది. నేను స్టేషనుకు చేరేసరికి కొంతమంది జనం వచ్చి రైలుకోసం ఎదురుచూస్తున్నారు. ఆ దినం రైలురావడం గంటన్నర లేటయింది. బండి ప్లాటుఫారంమీద నిలువబడడమే తరువాయిగా జనం గబగబ ఎగబడ్డారు. నేనుకూడ మూడో క్లాసు బండిలోకి కష్టంమీద ప్రవేశించి ఒకమూల కొంచెం చోటు కనబడితే ఇరికి కూర్చున్నాను. వర్షం కురుస్తూండడం బండి ఆలస్యంగా రావడంమూలంగా మూడవతరగతి బండ్లన్నీ జనంతో కిటకిటలాడిపోతున్నాయి. జనం ఇరికి ఇరికి కూర్చున్నారు. ఆ అడావిడిలో మూడవక్లాసువాళ్లు రెండోక్లాసులోను రెండోక్లాసువాళ్లు మూడోక్లాసులోను జొరబడ్డారు. ట్రయిను మొత్తంమీద ఏబండిలోనూ ఖాళీలేదు. గార్డు విజిల్ ఊదాడు. స్టేషనులో గంటకొట్టారు. ఇంజను కూతకూసింది. కదలడానికి సిద్ధంగావుంది రైలు. ఇంతలో ఒక పెద్దమనిషి సూటు బూటు హ్యాటుతో నానా అవస్థా పడుతూవచ్చి గబగబా నేను కూర్చున్న బండిలోకి తోసుకుంటూ జొరబడ్డాడు. వేషాన్ని బట్టి ధనవంతుడు, నెత్తిమీద టోపీనిబట్టి అధికారి అని గ్రహించాను. విశ్రాంతిగా నిల్చోడానికే చోటులేనప్పుడు కూర్చోడానికి చోటెల్లావస్తుంది? సిలువబడి ఉన్నాడు. నెత్తి

మీాదిటోపీ చంకలో పుచ్చుకొని ఫేంటుజేబులోంచి రుమాలు తీసి ముఖం తుడుచుకొంటున్నాడు.

ఆ పెట్టెలో కూర్చున్నవారిలో చాలామంది కూలి జనం కొద్దిమంది గుమాస్తాలు మొదలైన పనిచేసే మధ్యరకం వారున్నారు. మిల్లులలో పనిచేసేవాళ్లున్నారు. ఏదోవిధంగా కాయకష్టంచేసి కూలి నాలి చేసికొని జీవయాత్ర గడిపేవారి సంఖ్యయే అధికం. పగలలం నెత్తురు చెమటా ఏకంచేసుకొని పరిశ్రమ చేయగా లభించిన కూలిడబ్బులతో సాయంకాలానికిల్లు చేరుకొని భార్య బిడ్డలను పోషించుకొంటూండడం వారి దిన చర్య. సుఖాలకు భోగాలకు వాళ్ళు చాలా దూరంగాఉంటారు. విచారం-ఉదాసీనం-వారి ముఖాల్లో ప్రత్యక్షమాతూంటాయి.

బండి బయలుదేరి పై స్టేషనులో నిలువబడడంతో బండి వెనుకకు గట్టిగా గుద్దుకుంది. నిల్చున్న మనుష్యులంతా ఒకళ్ళమీాద ఇంకొకళ్ళు తూలిపోయారు. ఆ పెద్దమనిషి కూడ బల్లమీాదకు తూలిపోయాడు. ఆయనమీాద ముగ్గురు నల్గురు కూలీలు పడ్డారు. దానితో ఆయన ధరించిన యూనిఫారం డ్రెస్ అంతా నలిగిపోయింది. కోటు ప్యాంటు తాలూకు అంచులు నలిగిపోయాయి. ముందే తనకు కూర్చోడానికి చోటు దొరకలేదని చికాకు పడుతున్నాడు. తనకు కావలసిన రెండో తరగతి పెట్టె పరుపులు, అద్దాలు లేవన్న విచారంఉంది. బండి గుద్దుకోవడంలో తలుపుమీాద తూలిపోయినాడు. ఈ కూలీలు వచ్చి మీాదపడ్డారు. వాళ్ళ చిరిగినబట్టలు-మురికివాసన-చుట్ట కంపు శరీరంమీాద చున్న దుమ్ము ఇదంతా తన ఒంటినిండా

పడడం తన బట్టలు నలగడంతో కోపంపట్టలేక వెనుకనున్న కూలీని చూచి కేకలువేసాడు.

"తిన్నగా నిల్చోలేవా! మీద పడతావేం? తోస్తావెందుకు? మర్యాద తెలియదా? అన్నాడు.

తన వేషం తన గొప్పతనం అంతాచూసి తన కేకలకు ఆ కూలివాడు భయపడతాడని ఆ పెద్దమనిషి ఊహించాడు. కాని అందుకు వ్యతిరేకమయింది. ఆయన వేషంచూచి వాడు భయపడక పోగా ఎదురు జవాబిచ్చాడు.

"ఏమిటయ్యా! కేకలువేస్తావు? ఇది ఏక్లాసో తెలియదా? చూసుకోలేదా? ఇది మూడవ తరగతిపెట్టె ఇందులో కూర్చుంటే తోపులు తప్పవు. ఇంకా తగుల్తాయి. ఇందులో కూర్చునేవా రిట్లాంటి వాటికి భయపడరు. నువ్వు సహించలేకపోతే ఫస్టుక్లాసులోకి వెళ్ళు. అంతేగాని ఇక్కడుంటే గుద్దుకోడం తోసుకోడం తప్పదు.

ధైర్యంగా వాడిచ్చిన సమాధానానికి ఆ పెద్దమనిషికి కోపం వచ్చింది. చంకలోనున్న టోపీని తలమీద పెట్టుకొని ఆగలేక ఇట్లా అన్నాడు.

"జాగ్రత్తగా మాట్లాడు. ఎవరితో మాట్లాడుతున్నావో ఆలోచించుకో! వర్షంలో తొందరలో అవకాశం లేక ఈ బండిలోకి రావలసివచ్చింది. కాని ఇలాంటి బండిలో మే మెన్నడూ ఎక్కము. ఎందుకట్లా అరుస్తావు? ఇవతల ఉన్న పెద్దమనిషి ఎవరో వారి పొజిషన్ ఏమిటో తెలుసుకోకుండా

జవాబు చెప్తావు. పైగా తోయ్యడం ప్రారంభించావు. బట్టలన్నీ మురికిచేసి మీదపడుతూ పైగా ఎదురు దబాయిస్తున్నావే? బాగా ఆలోచించి మాట్లాడు.

ఇట్లా అంటూ ఆ పెద్దమనిషి ఒక్కమారు బండిలో కూర్చున్నవారి నందరిని చూశాడు. వాళ్ళంతా తన మాటలకు గాభరాపడి ఉంటారని ఆయనఊహ. వాళ్లు ఆయనమాట లెక్కచేయకపోగా ఆ కూలీ ఏమి సమాధానం చెప్తాడో వినాలనే ఆసక్తితో ఉన్నారు. వాడేదో తిరిగి అంటాడని వాళ్లకు తెలుసు. ఆ కూలివాడు జవాబుచెప్పాడు.

ఏమయ్యోయి! ఓ టోపీవాలా! నీదర్జా అంతా ఇక్కడెందుకు చూపిస్తావు? నేను ముందే చెప్పాను. ఇది నీవంటి వాళ్లకే బండికాదు. మూడవక్లాసు. ఇక్కడ పేదవాళ్లే ఉంటారు. రాకూడనిచోటికి వచ్చినప్పు డన్నింటికి ఒప్పుకోవాలి. బండి కుదుపు జనం ఒత్తిడి కనపడటంలేదా! ఇక్కడ తోసుకోనటం-మీద పడడం ఇరకాటం అన్ని అవస్థలూఉన్నాయి, ఉంటాయి. ఒళ్ళూ ఒళ్ళూ తగుల్తుంది. బట్టలు ఖరాబు అవుతాయి. ఇక్కడికెందుకొచ్చావు? ముందుగావస్తే నీబండే నీకు దొరికేదిగా! నువ్వు ధనికుడవు: నీస్థలం ఒకటి రెండు క్లాసులు. ఇది మాక్లాసు తెలిసిందా?

వాని సమాధానానికి కూలీలందరును కిక పక నవ్వుతున్నారు. తన గొప్పతనం ఆస్థలంలో వాళ్ళముందు పనికిరాకుండా పోయింది ఏంచేస్తాడు. ఇక్కడందరూ కూలీలే.

ఏమీ అనలేక వోరచూపులుచూస్తూ నిల్చున్నాడు. కూలీలంతానవ్వుతున్నారు. వాళ్ళట్లానవ్వుతూన్నకొద్దీఅతనికిఉద్రేకం ఎక్కువౌతూంది. ఆ కూలివాడు మళ్ళీ ప్రారంభించాడు.

"ఉండవయ్యా! ఏటిట్లా నవ్వులు? గొప్పవాళ్ళకు నచ్చ చెప్పాలి. ఏమయ్యా! అట్లు చూస్తావు. మ్రింగుతావా? ఇదిగో ఓ టోపీబాబూ మేము పేదవాళ్ళం నువ్వు గొప్పవాడవు. కూలి నాలి చేసుకొని బ్రతికే మావంటి వాళ్ళం ఇలాంటి తోపులకు భయపడ౯. నీకు భయంగా ఉంటే రెండోక్లాసులోకి వెళ్ళు. అంతేగాని నీగొప్పతనం మాకు చూపిస్తే లాభంలేదు. మాలో ఎవరైనా మీక్లాసులోకి వచ్చి కుర్చుంటే కోపంతో కొట్టొస్తారే. పోలీసుని పిలిచి దింపించేస్తేనేగాని నీమనస్సు చల్లపడదే నువ్వు మాక్లాసులోకి వస్తే ఏం జరగాలి? ఇక్కడ కూడ నీ అధికారమేనా! ఇట్లా ఉంది నీ పెద్దమనిషి తరహా. కాస్త కాలు ఒళ్ళు తగిలిందని మామీద ఎంత కోపంవచ్చింది? ఇహనైనా తెలుసుకో మీకాలం అయిన తర్వాత మాకాలం వస్తుంది. అంటూ ఆ పెద్దమనిషివంక తీక్షణంగా చూశాడు. బండిలో వాళ్ళంతా నవ్వుతున్నారు. నవ్వినకొద్దీ ఆయన కోపం ఎక్కువౌతూంది. పట్టలేక అన్నాడు.

"ఎందుకట్లావాగుతావు. మాట్లాడక ఊరుకోలేవూ! మీద పడి ఏభైరూపాయల సూటు పాడుచేసింది చాలక ఉపన్యాసం చెప్తున్నావే స్టేషను రానీ! గార్డును పిలిచి నీసంగతేమిటో కనుక్కుంటాను అనిచెప్పబట్ట దులుపుకోడం ప్రారంభించాడు. ఆ కూలీ ఆ పెద్దమనిషి ముఖం నిదానించి చూచి

నవ్వుతూ బండిలో ఉన్నవాళ్లతో మళ్ళీ ప్రారంభించేశాడు.

చూడండయ్యా! ఈ పెద్దమనిషి గారిని. మూడో క్లాసులో ఎక్కేడు. బండి అంతా క్రిక్కిరిసి కూర్చున్నారు. అందుచేత ఎక్కింది మొదలు బట్టలు మాసినాయని గోలపెడుతున్నాడు. ఎవరికీ తోపులు తగల్లేదు. ఈయన కొక్కడికే తగిల్నాయి. చూడండి ఆయన వైఖరి ఎవరైనా పుణ్యాత్ములుండి ఫొటో తీస్తే చాలా బాగుంటుంది. బాబూజీ! తోస్తున్నారా బట్టలు మాసిపోయినాయా! ఏదైనా వక మిల్లులో ఎప్పుడైనా పనిచేశావా! ఇంజనులో బొగ్గువేశావా! ఓడలలో బోయిలర్లదగ్గర నిల్చునిపనిచేశావా! రోడ్లమీద కంకర వేశావా! రెండుమళ్ల బరు వెప్పుడైనా మోశావా. శరీరం కష్టంచేసి కూలిడబ్బులు సంపాదించావా! అప్పుడు తెలిసేది దానిలోనిమజా. ఇవన్నీ నీ కెందుకు? నువ్వు లక్షాధికారివి మేడలో కూర్చుండి దేవేంద్రవై భోగమనుభవిస్తావు. బ్లాకుమార్కెట్ వ్యాపారంచేసి సంపాదించిన డబ్బును బ్యాంకిలో జమకట్టడం తెలుసు. తిమ్మిని బ్రహ్మినిచేసి డబ్బు సంపాదించడంలో ఘనుడవు. తలకాయలు మార్చడంలో నీ అంతవాడు లేడు. అల్లాంటి వాడవు నీకు రైలులో మూడవక్లాసు బండిలో సంగతి ఎట్లా తెలుస్తుంది? అప్పుడప్పు డనుభవిస్తూం టె తెలుస్తుంది. రోజుకు పద్దెనిమిది గంటలు పనిచేస్తే కూలీల కష్టం ఏమిటో అర్థమౌతుంది. కాస్త కాస్త గుడిసెలలో పది మందితో కలిసి వుంటే తెలుస్తుంది. గుడిసెల కాపురానికి మేడల కాపురానికి భేదం నెలకు పాతికరూపాయల జీతంలో

భార్యాబిడ్డలు తల్లితండ్రులతో జీవయాత్ర గడుపుతూంటే సామాన్యపు కుటుంబాలస్థితి తెలుస్తుంది.. క్రిక్కిరిసి కూర్చున్న బండిలో పక్కతోపులకు భయపడేవాడవు నీవెందుకు పనికి వస్తావు? ఎందుకు ఎక్కావు? ఎక్కావో అవస్థకు లోబడు. వీరంతా మనుష్యులుకారూ! నువ్వు పిలిచే పోలీసుగారు మమ్మల్ని ఏమీ చెయ్యలేడు. అన్నట్లు మరిచిపోయాను. పొలందున్నడం దమ్ముచెయ్యడం, వంగుని కలుపుతియ్యడం చేతనౌతుందా. మోటారులారీ లేమైనా తోలేవా. క్లీనరుగా పని చేశావూ! మురికితూములు బాగుచేశావా! వీధులు ఊడ్చావూ! చెప్పుల జోళ్ళు బాగుచెయ్యడం ఎరుగుదువా! కూరల కావిళ్ళు పళ్ళ తట్టలు మోసుకొని తిరిగి అమ్మేవూ! రిక్షా లాగేవూ! గతి లేక ప్లాటుఫారంమీద పడున్నావా? వర్షంలో తడుస్తూ పని చేశావా? అన్నం తినకుండా నువ్వు నీ కుటుంబం ఎప్పుడైనా లంకణా లున్నారా? చేతిలో పావలా డబ్బులు లేని రూపాయి అప్పు పుట్టని దరిద్రం అనుభవించావూ! రూపాయకు అణాన్నర వడ్డీ నిచ్చి అప్పు తెచ్చుకొన్నావూ? అప్పు తీర్చ లేక ఋణదాతచేత చీవాట్లు తిన్నావూ! స్టేషనులో పెట్టేసునిన్ను? లాటీ దెబ్బలు తిన్నావూ? తట్టకూలికి ఎప్పుడైనా వెళ్ళేవా! ఏం చూశావు ఏం అనుభవించావు? ఈ మాత్రం జనంవత్తిడి కాగలేక కళ్ళజ్జజేసి గార్డును పోలీసును పిలుస్తానంటావే. ఇంత మాత్రానికే భయపడితే మన మెందుకు పనికివస్తాము? నేను గొప్ప వాణ్ణి అని అనుకున్నంతకాలం నువ్వు లోకంలో గుడ్డి గవ్వకు మారవు. నువ్వు నీ-ఇంట్లోను - నీకుటుంబ పరివారం మధ్యను-నీఇచ్చకాలమారి స్నేహితుల మధ్య చెలా

మణి ఔతావు. అంతే కాని ఇక్కడ నీ లెక్క లేదు. దేశానికి నీదర్జాతో ఏమి పని లేదు. మహాత్ముడు ఎట్లా గొప్పవాడైనాడు? కుడిచెయ్యి ఎడమచెయ్యి అనకుండా సేవచేయడంచేత. ఉచ్చనీచాలను వదలి మానవ సేవకు పూనుకోడం, అవసరం వస్తే మరుగుదొడ్లుకూడా ఊడవడానికి తయారుపడి అసహాయోద్యమం నడపడంచేత మహాత్ముడైనాడు. ఆయన పోయిన తర్వాత అట్లాంటివాడెవడైనా ఒక్కడున్నాడా? అంతా బురఖాలు మార్చేవాళ్లే – కష్టపడాలి వొళ్ళు వంచాలి. కూలిపని చెయ్యాలి. మధ్యవాళ్ళ జవితా లెల్లా నడుస్తున్నాయో అప్పుడు తెలుస్తుంది. ఎవరినో పిలుస్తానంటావు. రానీ వాడొచ్చి ఏమిచేస్తాడో చూస్తాం.

అని ఊరుకున్నాడు. అక్కడఉన్న వాళ్లందరకు ఆమాటలు వేడుగాక ఉన్నాయి. మూడువంతులు నిజంకూడా అంతే. ఆయన చూపించిన అధికారానికి గర్వానికి ఆ వేషానికి తగిన జవాబిచ్చాడని అనుకున్నారు. ఆకూలి ఇంకోమాట చెప్పేడు.

ఏమయ్యోయి! ఏ. టోపీబాబూ! ఆఖరిమాట చెప్తున్నాను. విను. మేము పేదవాళ్ళం కూటికి గుడ్డకు లేనివాళ్లం బాబూ నువ్వే మా అన్నదాతవు నువ్వే మా దేవుడవు అని నీపాదాలకు మొక్కేదినాలు నీవు మావంటివాళ్ళను ఎడంకాలితో తోసివేసే దినాలు వెళ్ళిపోయినాయి. ఈప్రదేశం మాది, ఈ బండీ మాది. ఈ సంఘం మాసంఘమే. ఇక్కడ మామాటే చలామణీ ఔతుంది. కాని నీమాట వినేవారు

లేరు. నువ్వు పిలిచే పోలీసులు మావాళ్ళే. నీ రెండో క్లాసు లోకి మేము వస్తే తోసేస్తావే. అదేరీతిగా మేమంతా కలిసి నిన్నుతోసెయ్యగలం! తెలిసిందా?

అనేసి తన ప్రసంగం పూర్తిచేశాడు. అందరు ఆ పెద్ద మనిషిని చూడడం సాగించారు. పాపం ఒంటరిగాడు ఏం చేస్తాడు? ఏమి మాట్లాడుతాడు. అందరు వాళ్ళే. ఎప్పుడనతలికి పోదామా అని ఆలోచిస్తున్నాడు. ఊపిరాడటంలేదు. మెడ కురితాడు పడ్డట్టుంది. ఇటువంటిచోటికి తనవంటివాడు రావడం తప్పనని గ్రహించుకున్నాడు. తన సభ్యత అంతా సర్వనాశనం అయిందని ఊహించుకున్నాడు. ఇంతలో ట్రయిను స్టేషనులో నిల్చింది. టోపీ తలమీద పెట్టుకొని ఆ పెద్దమనిషి గబగబా దిగాడు. కూలీలందరు అతను దిగుతూంటే పకపక నవ్వి చప్పట్లు కొట్టేరు. ఆదినం రైలు ప్రయాణం అట్లా నడిచింది.



# పండుగ కానుక

రోగులనందరినీ పరీక్షించి చికిత్సా విధానము బోధించి తగు సలహాలనిచ్చి పంపి డాక్టరు చంద్రశేఖరం, తన లైబ్రరీ గదిలో కూర్చుండి విశ్రాంతి తీసుకుంటున్నాడు. గంటల గడియారం పన్నెండు కొట్టింది. తన రిస్టువాచిని చూచి రెండింటికి టైము సరిచేసి పడకకుర్చీలో వెన్నువాల్చాడు. కిటికీ తలుపులు తెరువబడి ఉండడంచేత ప్రక్కనున్న పూలతోటలో వికసించిన గులాబి మల్లెపువ్వులు సంపెంగపూలు మొదలైన పూలవాసనలు గాలిపాటున గదిలో ప్రవేశించి మనస్సున కానందమును కలుగజేస్తున్నాయి. ఉండుండి ఒక్కొక్కమారు శేఖరం ముఖమున ఆనందరేఖలు ప్రస్ఫుటమౌతున్నాయి.

మూడుసంవత్సరాలకు ముందా ప్రదేశం పొదలు రాలు ముండ్లచెట్లు మొదలగువానితో చాలా చీకాకుగా ఉండేది. అప్పుడప్పుడు తోడేలు చిరుతలు తిరుగుచుండుట వాడుక. చంద్రశేఖరం విదేశాలలో దంతవైద్యమును చదివి పరీక్ష ప్యాసై స్వగ్రామమునకు వచ్చి ధర్మార్థముగ నొక దంత చికిత్సాలయమును నిర్మింప నిశ్చయించెను. పిత్రీయమైన ఆస్తి చాలా ఉండుటచే కొంత విక్రయించి దంతవైద్యశాలకు రోగి వారి కనుకూలముగ నుండునట్లు నిర్మాణముచేయ నిశ్చయించి స్వగ్రామమైన నిడమానూరుకు 6 మైళ్ళ దూరములో రైలు రోడ్డు కొక మైలు ఎడముగనున్న యాస్థలమునుచూచి దానిని కొని బాగుచేయించెను. వెంటనే పని వారలను పిలిపించుకొని

మంచి లగ్నంలో కార్యప్రారంభం చేశాడు. అతని కొక్క అక్కగలదు. ఆమెభర్త ఇంజనీయరు. బెజవాడలో కాపురం. ఇంతకన్న అతనికి కావలసిన దగ్గిరబంధువు లెవ్వరునులేరు.

తగిన పనివారిని కుదిర్చి శ్రద్ధగా పనిచేయించుటచే దంత చికిత్సాలయము శీఘ్రకాలములోనే తయారైపోయింది. ఆస్పత్రి కానుకొనే తానొక బంగళా కట్టించుకొని అందులో ఉన్నాడు. రోగులందరిని పంపినతరువాత తనబంగళాకువచ్చి లైబ్రరీ రూంలో కూర్చుని చదువుకొంటూ కాలము గడుపు తూంటాడు. ఇంకా వివాహం చేసుకోలేదు. ప్రజా సేవయే అతని ప్రధానోద్దేశ్యమగుటచే దానికి ధర్మదంత వైద్య శాల అని పేరుపెట్టి బీదలకు ఉచితంగా చికిత్స చేయడంచేత చంద్రశేఖరంపేరు లోకంలో బాగావ్యాప్తమైంది.

తాను మొదలు పెట్టిన పని నిర్విఘ్నంగా సాగుతూ న్నందు కీశ్వరునికి వందనాలర్పిస్తూ పడకకుర్చీలో పడుకుని తన లోతాను ఒక్కమారు చిరునవ్వు నవ్వుకొన్నాడు. ఇంతలో వంటమనిషి గ్లాసుతో "లెమన్ క్రష్" నిమ్మ పండ్లరసముతో జేయబడిన పానకం తెచ్చి బల్లమీదపెట్టి వెళ్ళిపోయాడు. బం ట్రోతువచ్చి టపా ఎదురుగాఉంచివెళ్లేడు, శేఖరం గ్లాసు తీసు కొని నాలుగు గుక్కలు లెమన్ క్రష్ తాగి మిలిగిన దానిని బల్లపై ఉంచి టపా విప్పి చూచుకోడం ప్రారంభించాడు. విదే శములనుండి బొంబాయి కలకత్తా మొదలగుచోట్లనుండి కేట లాగులు మొదలగువానిని సావధానంగా చూడాలని ఒకచోట పెట్టి చికిత్సకు సంబంధించిన జాబులను చదువుకొని ఇంకో

వైపున ఉంచాడు. ఇంకొక కవరుమాత్రం ఉంది. దానిని విప్పి చదువుకున్నాడు. అది బెజవాడనుండి అప్పగారు వ్రాసినజాబు.

చిరంజీవి తమ్మునకు ఆశీర్వచనాలు. నువ్వు రోగుల సేవలో మునిగి నన్నుగూడా మరచిపోయినావు. అందుకు నీ దగ్గరనుండి జాబురాకపోవడమే నిదర్శనము. దీపావళి పండుగ దగ్గరకు వచ్చింది గనుక నీకు జ్ఞాపకముకై ఈ జాబు వ్రాస్తున్నాను. వచ్చే బుధవారం దీపావళి వెళ్ళిన విదియ. నీవు పండుగకు తప్పకుండా రావాలి. నీవు వ్రాసే ఇబ్బందులు ఆటంకాలు నేను గమనించను. పండుగ వెళ్ళిన విదియనాడు హారతిదినం. నువ్వు మరచిపోతావేమో నోటుబుక్కులో వ్రాసుకో. గతసంవత్సరం హారతినాడు రవ్వలు పొదిగిన ఉంగరం ఇచ్చావు. ఈమాటుకూడా నాకు అలాంటిదే మంచి బహుమానం రావాలి.

ఇంకొక సంగతి. ఈ మారు నీవు వచ్చే సరికి నీకొక అందమైన వస్తువును చూపిస్తాను. నీవు మరచిపోవాలన్నా పోలేవు. జారవిడిస్తే తిరిగి లభించని వస్తువు. నా స్నేహితులు, నాకు కాబోవు వదినెగారు... మిగిలిన విషయాలు... వచ్చిన తర్వాత.

ఇట్లు నీ ప్రియసోదరి.

శేఖరం చిరునవ్వుతో ఉత్తరం చదవడం పూర్తిచేసి శ్రీనివాసులూ అని బంట్రోతును పిలిచాడు. బంట్రోతు వచ్చి నిల్చున్నాడు.

"శ్రీనివాసులూ?

"అయ్యా

"దీపావళి దగ్గరకు వచ్చిందికాదూ!

"చిత్తము యెల్లుండి నరక చతుర్దశి

"నాకీసంగతి జ్ఞాపకం చెయ్యలేదేమి ?

"సామానంతా సరిచేశాను. కావలసిన బట్టలు పెట్టెలో పెట్టి బెడ్డింగుకట్టి సిద్ధంచేశాను. సాయంత్రం మీతో చెప్దామనుకొంటున్నాను.

"రేపు బయలుదేరి వెళ్ళాలి కాదూ?

"చిత్తము వెళ్ళకపోతే అక్కయ్యగారికి మనస్సు చాలా కష్టంగా ఉంటుంది.

"అక్కయ్య జాబు వ్రాసింది. దానిని చదువుకొన్న తర్వాత దీపావళి సంగతి జ్ఞాపకం వచ్చింది.

రోగుల చికిత్సలో తమరు పండుగలను కూడ మరచి పోతున్నారు. పేద వాళ్ళంటే అంతదయ.

సరే నువ్వు జాగ్రత్తగా చూస్తూండు. భోజనంచేసి వస్తాను.

శేఖరంలేచి అలమారతీసి సొరుగులోనున్న పర్సుతీసి లెక్కపెట్టగా రెండువందల రూపాయ లున్నాయి. పండుగ కర్చుకు చాలుననుకొని వాటిని పర్సులోనేఉంచి మరల యథా

స్థానంలో ఉంచి తాళంవేసి భోజనానికి వెళ్ళబోతున్నాడు. తోటపని చేసే రాములు ఎదురుగా వచ్చాడు.

ఎవరు, రాముడూ! ఏం ఇల్లావచ్చావు. రాముడు అస్పృశ్యజాతికి చెందినవాడు. డాక్టరు చంద్రశేఖరం బంగళాచుట్టూ ఉండే తోటలో కాపరిగా ఉంటూ వానిని బాగుచేసి శుభ్రంగా ఉంచుతూ సకాలములో నీళ్లుపోసి కాపాడుతుంటాడు. ఆ తోటలోనే ఒకమూల చిన్నతాటాకుల ఇల్లు వేయించి ఇచ్చాడు శేఖరం. రాముడు భార్యతో ఆఇంట్లో ఉంటాడు. తన ప్రశ్నకు రాముడు జవాబు చెప్పకపోవడంచేత శేఖరం దగ్గరగా వచ్చాడు.

రామం మాట్లాడవేమి. దేనికి వచ్చావు?

రామం దీనంగా తలవంచి నిల్చున్నాడు.

మాట్లాడవేమి? ఏమైనా పనుందా? అనుమానమెందుకు! ధైర్యంగా చెప్పు. డబ్బేమైనా కావాలా! రామం కళ్ళ వెంట నీళ్లుకారడం ప్రారంభించాయి. శేఖరం దగ్గరకుపోయి భుజంమీద చేయివేసి రాముడు ఎందుకు విచారిస్తున్నావు. సంగతేమిటి? అయ్యా! ఇంటి ఆడుమనిషికి—రామం మాట్లాడ లేకపోయినాడు. ఏమి? యమున కేమైంది జబ్బుగావుందా!

యమునవయసు ఇరువది సంవత్సరాలు. ఆయినాదాన కామెకు ముగ్గురు పిల్లలు. మూడవకాన్పు సులభంగా రాక పోవుటచే డాక్టరుగారిదగ్గరకు తీసుకొనివెళ్తే ఆయన చికిత్స చేసి ఇంకోమాటు కాన్పువస్తే పెద్దప్రాణం జీవించడం కష్ట

మని రామానికి సలహా ఇచ్చాడు! ఇప్పుడు నాలుగవ కాన్పు వచ్చింది. నెలలునిండినాయి. యమున బయటికి రావటంలేదు. ప్రసవకాలం సమీపించిన సూచనలూ— డాక్టరుగారు వెనుక చెప్పిన మాటలూ అన్నీ తలలో పనిచేస్తున్నాయి. గద్గద స్వరంతో—బాబూ! ఈమాటు కాన్పు—రామం మాట చెప్పలేక పోతున్నాడు. శేఖరం సంగతి గ్రహించాడు. ఎల్లా వుంది?

అయ్యా కొట్టుకుంటోంది. కడుపంతా విపరీతమైన బాధగా వుందని ఏడుస్తోంది. ఈమాటెలా గడుస్తుందో చాలా భయంగావుంది బాబుగారూ!

శేఖరం అనుమానించాడు. అతనికి మనస్సులో అప శ్సూచనలు గోచరించినా ఆభావాన్ని బయటికి రానీయక రామం భుజంమీద తట్టేడు.

రామం భయపడకు. అనవసరంగా దిగులు పెట్టుకోన వద్దు.

క్రిందటి కాన్పుకు డాక్టరుగారుచెప్పిన— ఆమాటకా భయపడుతున్నావు. ఏం భయంలేదు. నేను ఉత్తరం వ్రాసి స్తాను. బెజవాడవెళ్ళి డాక్టరు దీనదయాళ్ళును తీసికొనిరా. ఆయన ఒకనర్సునుకూడ వెంటబెట్టుకొనివస్తాడు. ఒంటిగంట బండిలో వెళ్ళు. కారుమీదవెళ్లు. మీరు వచ్చేసరికి స్టేషనుకు కారు పంపిస్తాను. కూర్చో ఉత్తరం వ్రాసిస్తాను.

శేఖరం కవరుతీసి డాక్టరుపేర జాబువ్రాసి దానిలో

కొన్ని నోట్లుంచి కవరుమూసి రామం చేతికిచ్చి రామం! నీవు వెంటనేవెళ్ళి దీనదయాళు కిచ్చివస్తే ఆయన వెంటనే బయలు దేరివస్తాడు. అంతవరకు యమునను నేను కనిపెట్టి చూస్తుంటాను. నీవు భయపడక వెళ్ళి డాక్టరును పిలుచుకొనిరా. పైలు వేళయింది త్వరగా వెళ్ళు.

రామం వెళ్ళిపోయాడు. శేఖరం అతివేగముగా భోజనం ముగించి రామం ఇంట్లోకి వెళ్ళి రోగి మంచమునకెదురుగా కూర్చుని అవసరమయిన తాత్కాలిక చికిత్సలు చేస్తూన్నాడు.

అర్ధరాత్రి పదిగంటలయింది. గేటుముందర కారు చప్పుడయింది. శేఖరం పరుగునవెళ్ళి తలుపుతీసి రామం! అని పిలిచాడు.

రామం!

డాక్టరుగారు వచ్చారా!

డాక్టరు దీనదయాళు కారులోంచి దిగుతూ గుడ్ నైట్ డాక్టరు! అని కేకవేశాడు.

"గుడ్ నైట్"

తరువాత అందరూ లోపలికి వెళ్లారు. దీనదయాళు నర్సుతో కలిసి రామం యింట్లోకి వెళ్ళేరు. శేఖరం రామం వెలుపల నిలువబడివున్నారు. ఎంతసేపు నిలుపబడి వున్నారో వారికే తెలియదు. క్షణమొక యుగంగా అనుద్విగ్నతో కాలము గడుపుతున్నారు.

ఇంతలో లోపలినుండి శిశురోదనం వినపడ్డది. ఇద్దరు ఒకరిముఖం ఇంకొకరు చూసుకొన్నారు.

రామం వెంటనే శేఖరం కాళ్ళమీదపడి బాబూ మీ దయవల్ల సుఖ ప్రసవమైంది. నా యమున రక్షింపబడదని తలుస్తున్నాను.

ఆకాశంనుండి ఒక నక్షత్రం క్రిందపడుట శేఖరానికి కన్పించింది. ధైర్యాన్ని వదలక కాళ్ళపైనున్న రామాన్ని లేవదీసి రామం ఈశ్వర సంకల్పానికి అడ్డుందా! వాడిదయ కాని నాదేమున్నది. ఆపత్కాలంలో ధైర్యంవదలకూడదు. అదే మనకు అండ. ఆమెపై నీకున్న ప్రేమయే ఆమెను రక్షిం చాలి.

ఇంతలో తలుపులు తెరచి ఇద్దరిని లోపలికి రమ్మని నర్సు కనుసైగచేసింది. ఇద్దరు లోపలికి వెళ్ళేరు, శేఖరం చూచి అడిగేడు.

నర్సు! అంతా సరిగా జరిగింది?

శిశువుకేమీ భయంలేదు. తల్లిప్రాణం సంకటావస్థలో ఉంది.

శేఖరానికి విపరీతమైన విచారము దుఃఖము వచ్చింది. నక్షత్రం క్రిందపడ్డ సంగతి జ్ఞప్తికి వచ్చింది. రామం నిలువలేక భార్యపైబడి వెక్కివెక్కి ఏడవటంమొదలుపెట్టేడు. ఎంతమంది ధైర్యంచప్పినా వాసిదుఃఖం ఆగిటంలేదు. యమున రామాన్ని క్షీణదృక్కులతో చూస్తుందేగాని గుర్తించే శక్తి

పోయింది. నర్సు శేఖరం రామాన్ని పట్టుకొని ఒకమూల కూర్చోబెట్టేరు. మోకాళ్ళపై తలయుంచి ఏడవటం ప్రారంభించాడు, ఇంకొకమూల నవజాత శిశువు, రోదనం చేస్తోంది. రామం ఆ శిశువును చూడలేక పోతున్నాడు. దీనదయాళు యమున నాడిని పరీక్షించి చూస్తున్నాడు. శేఖరం యమున ముఖాన్ని పరిశీలిస్తున్నాడు. ఆరిపోవు దీపానికి కాంతి ఎక్కువైనట్లు ఒక్కమారు యమునకు తెలివివచ్చి శేఖరాన్ని చూచి తన సోదరుడని చలించింది. చేయిమీదవైచి, అన్నా! వచ్చావా! వేళకు వచ్చావు ఇదిగో చూడు...నా బిడ్డడు. నువ్వే కాపాడాలి. నేను... వెళ్ళి..., యమునకు నేత్రములు శాశ్వతముగా మూతపడిపోయినాయి. రామం దుఃఖానికి అంతులేదు. శిశువును నర్సు ఎత్తుకుంది. డాక్టరు దీనదయాళు శేఖరం ఇరువురికి కళ్ళనీళ్ళు ఆగలేదు.

రామం యమున వీరిద్దరి దాంపత్యం చాలా ప్రేమ బద్ధమైంది. వారు అస్పృశ్యులైననూ వారి గుణాలు మాత్రం చాలా ప్రశంసనీయంగా ఉండేవి. ఆ దంపతులమీద శేఖరమునకు మిక్కిలి ప్రేమ వాత్సల్యాలు. వారిద్దరూ కలిసి తోట పనిచేస్తూన్నప్పుడు మాట్లాడుకొనే అనుకూల దాంపత్య ప్రసంగాలు శేఖరమున కాహ్లాదకరంగా ఉండేవి. రూపగుణములలోగూడ యమున గొప్పకుటుంబాలలోని వారి కేమాత్రం తీసిపోయేది కాదు. అటువంటి పవిత్ర జీవితం గడిపిన యమున, భర్త రామాన్ని వదలిపెట్టి దివ్యమైన సుమంగలి మరణాన్ని పొందింది. భ్రమచేతనేగాని లేక దైవసంకల్పంచేగాని చనిపోవునపుడు శేఖరాన్ని అన్నా అని పిల్చి తన నవ

జాత శిశువు నాతనిచేతపెట్టి తాను కళ్ళు మూసుకుంది. అది శేఖరానికి కూడా చాలా విచారకారణమైంది.



తలవని తలంపుగా సంభవించిన యీ సంఘటనవలవ చంద్రశేఖరం నరకచతుర్దశి నాటికి వెళ్ల లేకపోయినాడు. అమావాస్య వెళ్ళిన మరునాటికి తన అక్క గారింటికివెళ్ళి అందరిని పలుకరించాడు. తమ్ముడు పండుగకు రాకపోయినా హారతి దినానికి అందుకున్నందుకు అప్పగారెంతో ఆనందించింది.

విదియనాటి ఉదయం తమ్ముని పీటపై కూర్చోబెట్టి హారతీయబోయే సమయంలో తమ్ముని చూచి అడిగింది.

తమ్ముడూ ఈ సంవత్సరం నాకేమి బహుమతి తెచ్చావో చూపించవూ?

అక్కా! ఔను జ్ఞాపకముచేశావు. ఈ మాటు నీకు నేనియబోవు దీపావళి కానుక చాలా నాదరనీయంగా ఉంటుందని నమ్ముతున్నాను. అది ఈశ్వర సమ్మతమని నా నిశ్చయం. ఆగు ఇంకొకచోట ఉంచివచ్చాను. పావుగంటలో వస్తాను.

అని చెప్పి శేఖరం పైన వుత్తరీయం వేసుకొని ఎక్కడికో వెళ్లేడు. సుమారు పదిహేను నిమిషాలకే తిరిగివచ్చాడు. అప్పగారు విచిత్రంగా చూస్తోంది. తమ్ముని చర్య ఆమెకు అర్థంకావటంలేదు. వాకిట్లో జట్కాబండి ఆగింది. శేఖరం వచ్చి పీటమీద కూర్చుని నవ్వు! ఇట్లా తీసుకొనిరా! అని

కేకవేశాడు. నర్సు ఒక నవజాత శిశువును బట్టలో నుంచుకొని తీసుకొనివచ్చి నిల్చుంది. శేఖరం హారతీయమన్నాడు. అప్ప గారు మంగళహారతినిచ్చిన తరువాత శేఖర మా శిశువు నొడి లోకి తీసుకొని అక్కా! ఈ సంవత్సరం నేనిచ్చే కానుక ఈ నవజాత శిశువు. వీనికి నీవు మాతృస్థానంలోఉండాలి. మనతో టలో పనిచేసే రామా యమున ఇద్దరిని నీవు ఎరిగినవాళ్ళే. నాకుమిక్కిలి ప్రేమాస్పదులు. ఆ యమున రెండుదినాలక్రింద ఈ శిశువును ప్రసవించి చనిపోతూ నా చేతపెట్టి తనభర్తను దుఃఖంలోముంచి ఈలోకంవదలి పెట్టింది. అందుకే పండు గకు రాలేక పోయినాను. చూడు అస్పృశ్య బాలుడై ఆక ర్షణీయంగా ఉన్నాడో అరక్షకుడైన ఈ శిశువుకు నీవు మాతృ స్థానం ప్రసాదించి నా కడుపులోని భారం కొంత తగ్గిస్తావని నమ్మేను. ఏ సోదరుడైన తన సహోదరికిట్టి దీపావళి కానుక నిదివరలో ఇచ్చాడ! అట్టిభాగ్యం నాటికి నాకు లభించింది. ఇది దైవసంకల్పం. ఇది నీకిష్టమేనా అనిచెప్పి ముగించాడు శేఖరం. అప్పగారు వెంటనే ఆ శిశువును తీసుకొని తన వక్షస్థ లానికి అదుముకొని ముద్దు పెట్టుకొని కన్నీరు విడిచింది. అప్ర యత్నంగా ఆమెనోట్లోంచి ఈమాట బయలుదేరింది.

ఎంతచక్కని పిల్లవాడు. యమునా! ఇట్టిపిల్లవానిని కన్నావుగాని చేతులార పెంచుకునే అదృష్టానికి నోచుకోలేదు. ఎంత నిర్భాగ్యురాలవు,

# ఆడుబిడ్డ-వదినె

రామరామా! ప్రొద్దున్నే లేచి ఎవరిమొఖం చూశానో గాని ఎంత చెడువార్త విన్నాను! అనుకొంటూ కుటుంబరావు చేతులోని ఉత్తరం చించివేసి వంటఇంట్లోవుండే భార్య సుశీలకు ఎదురుగావచ్చి నిల్చున్నాడు.

బూర్లెమూకుడులో నెయ్యి వేసి కాగపెట్తూ సుశీల వెనకకు తిరిగి భర్తను చూసింది. కొంతసేపు నిదానించిచూచి అన్నది: "ఏమిటా ఉత్తరం? ఎక్కడనుంచి వచ్చింది? చదవ గానే చించి పారేశారు. ఏదైనామరణవార్త గాదుగదా! కొంపతీసి."

"ఏమి చెప్పమంటావు? ప్రారబ్ధాన్ని ఎవరూ తప్పించ లేరు. వారం దినాలకింద చూసివచ్చాను. ఏమోకాస్త జ్వరంగా ఉంది. ఫరవాలేదనుకున్నాను. ఇంతకూ రుక్మిణి ముఖాన ఆ గీత వ్రాయబడివుంది. మాధవరావు మొన్నరాత్రి మరణం—

కుటుంబరావుమాట్లాడలేకపోయాడు. గొంతుక బిగుసుకుపోయింది. సుశీల నిర్ఘాంతపోయి చేతిలోని గరిటెను వద లేసి "అయ్యో! అయ్యో అంటూ నెత్తిని కొట్టుకుంటూ "మాధవరావన్నయ్యా, అయ్యో వదినా రుక్మిణీ!" అంటూ కూలబడిపోయింది. కుటుంబరావు అట్లాగే నిలువబడి పో యాడు. "భగవంతుడా! ఎంతపని జరిగింది ? దాని కాపు

రం అంతా తలక్రిందులైంది. జీవితం అంతా అంధకారమైంది.
"అంటూ క్రిందపడ్డఉత్తరం తాలూకు పీలికలను తీసుకొని చూసి కన్నీరు కారుస్తూ పెనిమిటివంక చూస్తూఅన్నది. "ఇది వదిన వ్రాసిన కార్డేనా! ఎవరైనాశత్రువులు కల్పించి అబద్ధాలు వ్రాశారేమో! మీరు వెంటనే వెళ్ళి నిజమోఅబద్ధమో తెలుసుకోండి. ఇట్లాంటి విషయాలు స్వయంగా వెళ్ళి చూడడం మంచిది" "దేవుని దయవల్లనువ్వు అన్నమాట నిజమేకావాలి. ఇప్పుడేవెళ్ళి సంగతేమిటో కనుక్కొనివస్తాను. కాని ఇట్లాంటి విషయాలు సాధారణంగా అబద్ధంకావు. అదిగాక మాబావకిట్లాంటి విరోధు లెవరూ లేరు, ఏమైనా వెళ్ళక తప్పదు."

అంటూ లోపలికి వెళ్ళి కుటుంబరావుబట్టలుమార్చుకొని బయలుదేరేడు. గడపలు దిగినతర్వాత సుశీలభర్తతో అన్నది. "-ఇదిగో నామాటవినండి. ఉత్తరంలో సంగతి నిజమే అయితే పన్నెండు దినాలపని అయిపోయిన తరువాత ఇంట్లో సామానంతా జాగ్రతచేసి వదినెను తీసుకొనిరండి, అంతేగాని అక్కడ ఉంచవద్దు. ఒకవేళ రాననిపట్టుపట్టినా నేనుఅన్నాననిచెప్పి వెంటపెట్టుకుని రండి. పాపము ఒక్కర్తే రోదనం చేస్తూ ఒంటరిగా ఎట్లాఉంటుంది? అయ్యో భగవంతుడా!"

కుటుంబరావు తండ్రి రుక్మిణి వివాహం ఎంతో వైభవంగా డబ్బు ఖర్చుపెట్టి చేశాడు. అందుకు తగినట్లు రుక్మిణి కూడా అత్తవారింటికి వెళ్ళిన తర్వాత తన కర్తవ్యాన్ని చక్కగా నెఱవేర్చడమేగాక భర్తను దైవంగా చూస్తూ భగవంతుడు ప్రసాదించిన ముద్దులబిడ్డకు గోపాలాన్ని చూసు

కొంటూ కాలక్షేపం చేస్తోంది. తరువాత నాలుగు సంవత్స రాలకే కుటుంబరావు తండ్రి చనిపోయాడు. రుక్మిణి రెండు కుటుంబాల గౌరవాన్ని కాపాడుతూ సంసారం నిర్వహిస్తోంది. ఇంతలో ఈ మహా విపత్తు సంభవించింది.

కుటుంబరావు చెల్లెలుగారింటికి వెళ్ళేసరికి రుక్మిణి పిల్లవాణ్ణి ఒళ్లోకి తీసుకొని కంటికి నేలకూ ఏకధారగా ఏడుస్తోంది.

కుటుంబరావు గుండె రాయిచేసుకొని చెల్లెలిని ఓదా రుస్తూ బావమఱది అంత్యక్రియలను పూర్తిచేయించడంలో మునిగిపోయాడు.

సుశీలకు దుఃఖం ఆగటంలేదు. పెనిమిటి వెళ్ళిన తర్వాత ఒంటరిగాకూర్చుని ఆడుబిడ్డసంగతిని తలచుకొని విచారపడుతూంటే ఇరుగుపొరుగు ఆడువారు వచ్చి ఓదార్చి పోతూంటారు. దినాలు గడచినకొద్దీ దుఃఖాన్ని దిగమింగి సుశీల పెనిమిటి రాకకోసం ఎదురుచూస్తోంది.

అంత్యక్రియలన్నీ జరిగిపోయిన తర్వాత ఒక దినం ఒంట రిగా కూర్చున్నప్పుడు కుటుంబరావు చెల్లెలికి వదినెగారి సందేశాన్ని తెలియచేశాడు. రుక్మిణి మనస్సులో ఆలోచించ డం ప్రారంభించింది. "భర్త చనిపోయిన కొత్తలో ఆయన తాలూకు స్థిరచరాస్తుల విచారణ అంతా వదలిపెట్టి పుట్టింటికి వెళ్ళితే బాగుంటుందా! రానంటే అన్నగారికి వదినెకు కోపం వస్తుందేమో" ఈవిధంగా కొంతసేపు యోచనచేసింది. చివ రకు కష్టకాలంలో ఆదరించవచ్చిన అన్నగారి మాటత్రోసి

వెయ్యడం బాగుండదని నిశ్చయించుకొంది. ఇంట్లో ఉంటే ఏ వస్తువునుచూచిన ఆమెకు పెనిమిటి యొక్క రూపం కన్నుల గట్టినట్లు కన్పడంచేత కన్నీరు అవిరామంగా ప్రవహిస్తోంది. ఇకమీద తాను ఒంటరిగా ఆఇంట్లో ఉండలేననే భయము నిశ్చయం కలిగిన తర్వాత ఒక నిమిషంకూడ నిలువలేక వెంటనే సామానుసర్ది, అవసరమైనవి వెంటతీసుకొని అన్నగారితో ప్రయాణమైంది.

కుటుంబరావు చెల్లెలిని, మేనల్లుని వెంటబెట్టుకొని ఇంటికి వచ్చాడు. పుట్టింటికివచ్చినతర్వాత రుక్మిణిని సుశీల కన్నకూతురు కన్నఅధికంగా ప్రేమించి మితిలేని వాత్సల్యాన్ని చూపిస్తూఉండంచేత ఒకవిధంగా పతివియోగ దుఃఖాన్ని ఆమెమరచిపోయింది. మూడు సంవత్సరాలీ విధంగాజరిగినాయి. గోపాలమును సుశీల కన్నబిడ్డకన్న ఎక్కువ దయతో కాపాడుతూఉండడం చేత తల్లికన్న మేనత్తదగ్గిరే చనువైపోయి తన ఆటపాటలు ముద్దులు ఆమెకే చూపించడం సాగించాడు. ఇరుగు పొరుగు వారంతా ఆ ఆడుబిడ్డ వదినిగార్ల ఐకమత్యం జూచి ఆశ్చర్యపడుతుండేవారు. ఆడువారంతా ఒకచోట కూర్చున్నప్పుడు "లోకంలో వదినెగారికి ఆడుబిడ్డకి ఇంత ప్రేమానురాగాలు ఎక్కడా చూడలేము. స్వంత అక్కచెల్లెండ్రకన్న ఎక్కువగా ఉంది." అని అనుకొనే వారు. సాధారణంగా స్త్రీలకు ఇతరుల కుటుంబ విషయాలను గూర్చి మాట్లాడడం వారిని ఆక్షేపిస్తూఉండడం సహజగుణాలు. గనుక అప్పుడప్పుడీ విధంగా ప్రసంగిస్తూండేవారు.

ఒకతె: ఆశ్చర్యము ఏముందమ్మా! డబ్బుగల ఆడుబిడ్డ! ఎంత గౌరవమైన జరుగుతుంది! ప్రేమానురాగాలు నానాటికి వృద్ధిపొందుతూ వుంటవంటే దానికి డబ్బే కారణంగాని ఇంకొక టేమీ లేదు.

ఇంకొకతె :- రుక్మిణి పేదరాలైతే సుశీల ఇంతగా ఆదరిస్తుందా !

మరియొకతె:- ఎప్పుడు అట్లాజరుగదు. అదంతా ధనం మూంచిన గౌరవమే.

వేరొకతె :- ఏమైనా అనండి ఆడుబిడ్డ వదినెగార్ల మధ్య ఇంత ప్రేమవాత్సల్యం మనం చూడము.

ఇట్లా ప్రసంగాలు జరుగుతూండేవి. ఒకనాడు కుటుంబరావు, సుశీల, రుక్మిణి ముగ్గురుకూర్చుండి ఇష్టాగోష్ఠిగా మాటలాడుకుంటున్నారు. మాటవరుసకు కుటుంబరావు చెల్లెలితో ఇట్లా అన్నాడు. "అమ్మాయీ! పిల్లవాడు గోపాలం పెద్దవాడౌతున్నాడు. చదువుపూర్తికావడం పెళ్ళిచెయ్యడం మొదలైన ఖర్చులుచాలా ఉన్నాయి. నేనొకవిషయం ఆలోచించాను. దానిని సావధానంగా విని నీ అభిప్రాయం చెప్పు. ఏమిటంటే ఈవైపున భూములు చవుక. పంటగూడా బాగాఉంటుంది. మీ వైపున భూములు చాలాఖరీదు అందు చేత [illegible] ఇల్లు మొదలైన స్థిరాస్థి అమ్మి ఇక్కడ కొంటే స్థిరాస్థి సగానికి సగం పెరుగుతుంది. మేము కూడా దగ్గిరఉంటాము గనుక చూస్తూంటాము. ఇందు విషయమై నీ అభిప్రాయం ఏమో చెప్పు."

పెనిమిటి మాటను సమర్థిస్తూ సుశీల అన్నది:- "ఔను వదినా! మీ అన్నయ్య చెప్పిన సలహా చాలాబాగాఉంది. అక్కడ నీకు తోడు లేరు. ఒక్కదానవు నిర్వహించుకో లేవు. ఇక్కడ ఆయనఉంటే నీకుఅన్నివిధాలా సహాయంగాఉంటుంది. నువ్విక్కడ మీ ఆస్థి అక్కడ ఉండడం కంటే అంతా ఒక చోటనేవుంటే బాగుంటుంది. ఇంతకూ మేము అన్నామని కాదు. నీకేది అనుకూలమో ఆలోచించుకో."

రుక్మిణి అన్నది:- "నాకేమి తెలుస్తుది అన్నయ్యా! ఆడదాన్ని పిల్లవాడి క్షేమంగోరి నువ్వు ఎట్లాచెప్తేఅట్లా చేస్తాను. నీమాట కాదంటానా. వాడికి నీకంటె ఎవ రున్నారు?"

కుటుంబరావు అన్నాడు. అలాగైతే నాపేర పవర్ ఆఫ్అట్టర్నీ వ్రాసిఇయ్యి. నేనువెళ్ళి ఆభూములువగైరా స్థిరాస్థి అమ్మి ఈ ఊరికి దగ్గరగాఉన్న మంచి భూములు కొంటాను."

రుక్మిణి అంగీకరించింది.

మానవుని మనోవృత్తి చంచలంగా ఉంటుంది. అందు కనే పెద్దలంతా మనస్సు కోతివంటిదని చెప్పేరు. ఈ దినం ప్రేమించిన వ్యక్తిని ఇంకోనాడు విరోధిగా చూస్తాడు. ఈ దినం ఉన్నభావాలు ఇంకోనాడు ఉండవు. ఇదంతా మాయా విలాసం. డబ్బుపిచ్చిలో పడ్డవాడు ఎంతసాహసానికైనా ఒడి గట్టుతాడు.

కుటుంబరావు చెల్లెలితాలూకు భూములను అమ్మగా వచ్చిన క్రయధనంతో తనఊరికి దగ్గరగా మాగాణి భూములను

కొన్నాడు. కాని అంతఆస్థి చేతికి చిక్కేసరికి అతనిబుద్ధి ఆకస్మికంగా మారిపోయింది. ఆశాపిశాచము, లోభదేవత తలమీద నాట్యం చేశాయి. దానితో ఆ ఆస్తినంతా స్వాధీనం చేసుకోవాలని తలంపుపుట్టి మైనరు గోపాలానికి గార్డియనుగా తన చెల్లెలిపేర పెట్టవలసిన దస్తావేజులన్నీ తన వ్యక్తిగతంగా వ్రాయించుకొని రిజష్టరు చేయించుకొన్నాడు. ఇందుకుగాను కరణం మునసబులకు ఇరుగుపొరుగున ఉన్నవారికి లంచం ఇచ్చి తన కార్యం పూర్తిచేయించుకొన్నాడు. కొంతకాలం వరకూ రహస్యంగానే ఉంది. కుటుంబరావు దస్తావేజులను ఇతరుల కెవరికీ చూపించకుండా తన పెట్టెలోపెట్టి తాళము వేశాడు.

కాని పాపం ఎన్నాళ్లో దాగదు. "నిజం నిలకడమీద తెలియక మానదు" అనే న్యాయాన్ని అనుసరించి రహస్యం ఏనాటికైనా బయల్పడక మానదు. యదార్థం లోకులకు తెలియకపోదు. అట్లా జరుగకపోతే సత్యం నశించుకుపోయి పాపం లోకాన్ని పాలిస్తూవుంటుంది.

కుటుంబరావుదగ్గిర లంచంతిన్న ఒకానొక వ్యక్తికీ అతనికీ ఏదో విషయంలో కలహం వచ్చింది. అది కారణంగా ఆ వ్యక్తి కుటుంరావు రహస్యాన్ని ఇంకోమిత్రుని చెవులో ఊదేశాడు. పెదవిదాటితే పృథివి దాటుతుందన్నట్టు ఈవార్త ఊరంతా పాకిపోవడముగాక రుక్మిణికికూడా తెలిసింది. కాని ఆమె ఆమాటలను మొదట నమ్మలేదు. తన విషయంలో అన్నగారటువంటి అన్యాయం చెయ్యడని ఆమె విశ్వాసం

అయినప్పటికి తరచుగా ఆడువారి నోటినుంచి అదే ప్రసంగం వినపడడంచేత విన్నకొద్దీ రుక్మిణిహృదయంలో కూడా సంశయ బీజాలు నాటుకొన్నాయి. ఎంత సందేహిస్తున్నా అన్నగారి ఎదుటబడి అడగలేకపోయింది. చివరకు మనస్సు పట్టలేక వదిన గారితో ఒకరోజున ఇట్లా అన్నది. "వదినా! అవతల వీధిలో ఉండే చంద్రమతి నాతో ఎలాంటి మాట అన్నదో విన్నావా?

సుశీలకు సుస్థిగా ఉండడంచేత మంచంమీద పడుకుని ఉంది. ఆడుబిడ్డ మాటవిని ఇట్లా అడిగింది.

"చంద్రమతి ఏమన్నది?"

రుక్మిణి జవాబు చెప్పడానికి అనుమానించింది. సుశీల వెంటనే అన్నది. "అనుమానిస్తావేమి? ఏమన్నదో చెప్పు. భయమెందుకు?"

రుక్మిణి అన్నది:- "అన్నయ్య భూమి అంతా గోపాలం పేరుకు బదులుగా తన పేరుమీద తానే కొన్నట్లు రిజిష్టరు చేయించుకొన్నాడని చెప్తోంది."

ఆమాట వినగానే సుశీల ఉలికిపడ్డది. వెంటనే ఆవేశంతో అన్నది. "ఏమన్నావు? పొలం ఆయన పేరుమీద కొనుక్కున్నారా? అట్లా ఎప్పుడైనా జరుగుతుందా"

"నాకు ఎంతమాత్రమూ నమ్మకంలేదు వదినా! ఏదో అబద్ధం చెప్పిఉంటుంది. సుస్థిగాఉన్న నీమనస్సుకు కష్టం కలిగించాను. కోప్పడకు. అన్నయ్య ఎప్పుడూ అట్లా చెయ్యడు."

ఎప్పుడూ జరుగదు. కాని డబ్బు పాపిష్టిది. దానిని చూడగానే ఎటువంటి హృదయమైన మెత్తపడిపోతుంది. ఏక్షణాని కెట్టిమార్పువస్తుందో మనం ఊహించలేము. అసలు సంగతి ఏమో నెమ్మదిగా కనుక్కొంటాను! నువ్వు కంగారు పడక లోపలికి వెళ్ళు."

రుక్మిణి మాట్లాడక లోపలికి వెళ్ళిపోయింది. కొంత సేపటికి కుటుంబరావువచ్చి కాళ్ళు చేతులు కడుక్కొని ఉత్తరీయం వంకెకు తగిలించి భార్యదగ్గరగా వచ్చి కూర్చున్నాడు. వెంటనే సుశీల ఏదో ప్రసంగం తీసుకువచ్చి మాట సందర్భంగా పతిని అడిగింది. "చూడండి నేనోసంగతివిన్నాను. అడిగితే నిజం చెపుతారా?"

కుటుంబరావుకు గుండెలుకదలుతున్నాయి. గ్రామంలో తన రహస్యం వెల్లడి అయిందని అందరికి తెలిసిందన్నసంగతి కుటుంబరావుకూ తెలుసు. అప్పటినుండి ఎప్పుడు పేచీవస్తుందో అని అనుమాన పడుతూనే ఉన్నాడు. భార్య వేసిన ప్రశ్నకు లోలోపల తటపటా యిస్తూనే ఉన్నా కొంత ధైర్యం తెచ్చుకొని అడిగేడు. "ఏమాసంగతి?"

"వదిన డబ్బుతో కొన్న భూమి మీ పేర వ్రాయించుకొన్నారా?"

"ఎవరన్నారు!"

"ఎవరంటేఏమి? అన్నవానితో మన కవసరంలేదు. మీరు వ్రాయించుకొన్నారా లేదా?"

"ఇలాంటి పనికిమాలిన మాటలు ఎవరోఅనడం నువ్వు వినడమూనా! వేరే పనిలేదా?"

అంటూ కుటుంబరావు అక్కడనుండి వెళ్లాలని ప్రయత్నించాడు. కాని సుశీల లేచి చెయ్యిపట్టుకొని అడిగింది. "సరిగా జవాబు చెప్పకుండా వెళ్ళిపోతారేమి? దస్తావేజులూ నాకు చూపించండి. నేను చూడాలి. అనుమానం కలిగినప్పుడు రహితం చేసుకోవలసిందే."

"నామాటమీద నీకేమి నమ్మకంలేదా?"

"నమ్మకం ఉండడం లేకపోవడంతో నాకు అవసరం లేదు. దస్తావేజులు చూపించండి. చూపించమంటే మీకా సంశయం ఎందుకు?"

అంటూ సుశీల భర్తను నిలువదీసింది. కుటుంబరావుకు ఏమీతోచలేదు. తలగోక్కుంటూ "నెమ్మదిగా చూపిస్తాలే. ఇప్పుడు కాదు" అన్నాడు.

"ఇప్పుడు కాదూ? నాకిప్పుడే చూపించాలి. దీనికి వారాలు వర్జ్యాలూ కావాలాఏమి? వదినకూడా చూడాలనుకుంటోంది."

కుటుంబరావు ఏమీ మాట్లాడలేదు. భర్త వైఖరి చూచినకొద్దీ సుశీలకు అనుమానం స్థిరపడింది. ఆవేశానికి లొంగిపోయి తనపెనిమిటి అనర్థం చేశాడన్నవిషయం గ్రహించుకొని ఇట్లాఅన్నది. ఛీ!ఛీ! ఇట్లాంటిపని చేయడానికిచేతులెట్లా వచ్చాయి? మీబుద్ధి ఇంత చెడిపోయిందేమి? చదువుకున్న

వారుగదా! పసిపిల్లవాడు. గోపాలం ఆస్తిమీద మీకు ఆశ ఎట్లా కలిగింది? నీ కొడుకొకటి నీ మేనల్లుడొకటా? ఏమీ తెలియని అజ్ఞానికూడా ఇది తప్పని చెప్తారే! మీకామాత్రం తెలియలేదా? మీకులేదా? దరిద్రం వచ్చిందా? లేకపోయినా మనఅవస్థ మనంపడాలిగాని "స్త్రీవిత్తమధమాధమం" అన్నట్లు ఆడుదాని ద్రవ్యం! అందులోనూ చెల్లెలి ఆస్తి! రామరామ! చివరికిటువంటి అధర్మం చెయ్యాలన్నబుద్ధి ఎట్లా పుట్టింది!"

భార్యమాటలు వాడిబాణాలు తగిలినట్లు మనస్సుకు నొప్పికలిగించాయి. వెంటనే గట్టిగా డబాయించి అన్నాడు- "చేస్తే చేశాను. ఎవడిబాబు సొమ్ము నేను అపహరించలేదు. నా మేనల్లుని ఆస్తి నేనుస్వాధీనం చేసుకొన్నాను. పెద్దవాడు కాగానే నచ్చచెప్పి అప్పగిస్తాను. ఇంకొకడికీ విషయంతో ఏమి అవసరం?"

"ఆహాహా! ఎంత ధర్మోపన్యాసం! మేనల్లుని ఆస్తి రక్షించమంటే సంగ్రహించారట! తరువాత ఎప్పుడో అప్ప గిస్తారట! చాలు చాలు ఇదేనా మీ మానవత్వం? ఇంకా చెల్లెలికి చేతనైన సహాయం చేయడంపోయి ఒక రక్తం పంచుకొని పుట్టిన తోబుట్టువు ఆస్తి కాజెయ్యడమా! పుణ్యాపాపవిమర్శన- ధర్మాధర్మ విచారణ పోయింది. ఇదిగో నామాట వినండి వెంటనే ఆస్థి గోపాలంపేర వ్రాసి ఇచ్చి వేరే ఇల్లుకొని వాళ్ళ నిద్దరినీ అందులో ఉంచండి. వాళ్ళకు ఇహామీద మీతో కలిసిఉండడం ప్రమాదమే. మేనల్లుని ఆస్థి సంగ్రహించి వానిని సర్వనాశనం చెయ్యాలనుకున్న వ్యక్తి ఎంత పాతకానికైనా ఒడిగట్తాడు."

కుటుంబరావుకు నోరెండిపోతోంది. నిలవడం కష్టంగా ఉంది. ధైర్యం చిక్కబట్టుకొని అన్నాడు. "చాలు చాలు కట్టి పెట్టు చాలాదూరంవచ్చావు నోరుముయ్యి జాస్తిగా మాటాడ్తే బాగాఉండదు.

సుశీల పతిమాటవిని రోషాభిమానాలతో అడిగింది. "నాకీ మాటలతో అవసరంలేదు. వాళ్ళఆస్తిని వాళ్ళకు ఇస్తారాలేదా! రేపే కాగితం గోపాలంపేర వ్రిప్పి వ్రాయించి రిజిష్టరు చేస్తారోలేదో గట్టిగా చెప్పండి." "నేనా సంగతంతా నీతో చెప్పవలసిన అవసరంలేదు. నామేనల్లుని విషయంలో నువ్వు జోక్యం కలిగించుకోవద్దు. వాడు నాఇంట్లో ఉన్నంత కాలం వాని ఆస్తి అంతా నాదే. పెద్దవాడైన తర్వాత ఇస్తాను. అంతవరకూ ఎవరికీ అడగడానికి అధికారంలేదు. తెలిసిందా?"

"తెలియకేమి? అంతా తెలిసింది. ఇట్లాంటి పనిచేసి ఎదురు దబాయించడం కూడానా! జ్ఞాపకంఉంచుకోండి. ప్రపంచంలో ఇంకా ధర్మం నాశనం కాలేదు. ధర్మం జయించి తీరుతుంది."

"చూద్దాములే" అనుకొంటూ కుటుంబరావు గబగబా వెళ్ళిపోయాడు.

తర్వాత కొన్నిదినాలు గడిచిపోయాయి. ఒకనాడు సుశీల కూర వండుతోంది. గిన్నెలో ముక్కలను గరిటెతో కలియపెట్టోంది. కుటుంబరావు వచ్చి అడిగేడు.

"ఇదిగో చూడు మునసబుగారి అబ్బాయికి స్టాంపులు తెమ్మని డబ్బు ఇచ్చావా?"

కూర కలియపెట్టూనే అన్నది. "ఔను ఇచ్చాను"

"దేనికి స్టాంపులు?"

"స్టాంపులు ఎందుకు పనికివస్తాయో అందుకే"

"చెప్పగూడదా?"

మీా కెందుకా సంగతి? నా ఆస్తి అంతా గోపాలానికి సర్వాధికారాలతో వ్రాసి ఇచ్చేస్తున్నాను."

సుశీలకు సుగుణ అనే అప్పగారు ఉంది. వారి తండ్రికి పురుషసంతానం లేకపోవడంచేత తన ఆస్తిఅంతా కూతుళ్లు ఇద్దరికీ చెరిసగంగా సర్వాధికారాలతో వ్రాసి ఇవ్వబడింది. ఆ విధంగా వచ్చిన తండ్రి తాలూకు సుశీలవంతు ఆస్తి గోపాలం ఆస్తికంటె రెండురెట్లు అధికంగా ఉంటుంది.

కుటుంబరావు చేతులు నలుపుకొంటూ భార్యతో అన్నాడు. "నువ్వు చేసేపని ఆఖరికి ఎట్లా పరిణమిస్తుందో ఊహించావా? ఏ ఊహతో ఇట్లా చేస్తున్నావు?"

"నేను బాగా ఆలోచించే ఈపని చేస్తున్నాను. పెని మిటి చేసిన మహాపాపానికి ప్రాయశ్చిత్తం చేసుకొంటున్నాను. అయినా ఈ విషయంలో కల్పించుకోడానికి మీాకేమి సంబంధం ఉంది?"

"నువ్వు చేసేపని మంచిదికాదు. దూరం యోచించుకో?"

"మోచించుకోవలసింది మీరుగాని నేను కాను: కాక పోయినా మీరుచేసిన ఘనకార్యాలు మంచికా ఇది మంచిదని ఎలా ఔతుంది?"

"నాతో పోట్లాడడానికి ఎదురుగా సంసిద్ధురాలవై నావా?"

"మీరుచేసే సత్కార్యాలలో మీతో సహకరిస్తాను గాని, మీరుచేసే దుష్కార్యాలకు ఎప్పుడూ మీకెదురుగా నిలువబడి ప్రతిఘటిస్తాను. మన సంబంధాలు కపటములు కావు. వివాహకాలంలో అగ్నిసాక్షిగా మహాసభలో "ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరామి, నాతిచరితవ్యా" అని ప్రమాణాలు చేసుకొని వివాహితులమైనాము. కనుక ఇప్పుడు మీరు చేసే అన్యాయాన్ని ఖండించడానికి నాకు సర్వాధికారాలూ ఉన్నాయి. మీ దబాయింపులు బెదిరింపులు నా కర్తవ్యాన్ని చెడగొట్టవు."

రుక్మిణి చాటుగా నిల్చుని వీరిసంభాషణ వింటోంది. మనస్సులో ఇట్లా అనుకొన్నది. "ఒక్క తల్లి కడుపున పుట్టిన బిడ్డలు డబ్బుకోసం ఈవిధంగా అన్యాయానికి ఒడిగట్టి పరస్పర ద్రోహానికి పూనుకొంటూంటే ఎక్కడో దూరాన వేరు తల్లి దండ్రులకు పుట్టి ఈ ఇంటికోడలై వచ్చిన వదిన గారు ఈ విధంగా ధర్మనిర్ణయంకోసం పోట్లాడడం చాలా ఆశ్చర్యంగా ఉంది. ఇట్టి మహాలక్ష్మి నాకు వదినగారు కావడం ఎంత అదృష్టం! ఇదంతా దైవానుగ్రహం. ఇట్టి సంఘటన జీవితంలో ఎన్నడూ చూడలేదు. ఇక ముందుకూడా చూడ

సేమో" అనుకొంటూ కన్నీరుకారుస్తూ భగవంతునకు వంద
నాలు సమర్పించింది.

◆ ◆ ◆

ఒకదినం రుక్మిణి మధ్యసావడిలో కూర్చుని గోపాలాన్ని ఒడిలోకితీసుకొని తలపరీక్షిస్తూ పరధ్యానంగా ఉంది. కొంచెం సేపటికి సుశీలకూడా వచ్చింది. ఇద్దరూకలిసి ఏవో నవ్వుతూ మాట్లాడుకొంటున్నారు.

వెనుకనుండి కుటుంబరావువచ్చి చెల్లెలిముందు దస్తావేజుల పడవేసి అన్నాడు. "చెల్లీ! ఇదిగో. నీతాలూకు యీవదాస్తి పిల్లవానిపేర వ్రాయించి రిజిష్టరు చేయించాను. ఇంతేగాక నా ఆస్తిలోకూడ కొద్దిభాగం గోపాలంపేర వ్రాశాను.

ఆమాటవినగానే సుశీల చప్పట్లుకొట్టి పకపక నవ్వింది. కుటుంబరావు అన్నాడు. "ఇంకా పరిహాసాలెందుకూ! నా తెలివితక్కువకు ఇంకా నవ్వనక్కరలేదు. ఇది నాకు పుట్టిన బుద్ధికాదు. కరణంవచ్చి రాత్రింబగళ్లు పోరితే నాబుద్ధి మారిపోయి అట్లా చేశాను. అందుచేత క్షమాపణ కోరుకొంటున్నాను. "చెల్లీ! నువ్వు ఈవిషయంలో వేరుగా భావించవద్దు. ప్రమాదము ఎంతవారికైనా వస్తుంది."

రుక్మిణి పిల్లవానిని కిందకూర్చోపెట్టి అన్నగారికి వదినెగారికి సాష్టాంగ నమస్కారం చేసింది. సుశీల ఆడుబిడ్డను కౌగలించుకొని శిరస్సు ముద్దుపెట్టుకొంటూ ఆశీర్వచనం చేసి మగని ముఖం నిదానించి చూచి చిరునవ్వు నవ్వింది.

# ఇది త్యాగంకాదు-నా కర్తవ్యం

కొత్తగా కట్టించిన జనరల్ హాస్పటలుకు ఉత్తరదిశలో నున్న బంగాళా ప్రత్యేకం మాకోసమకై గవర్నమెంటువారు ఏర్పాటు చేశారు. భవనము చిన్నదైనా చూడడానికి అందంగా గాలివచ్చుటకు వీలుగా వాసయోగ్యంగా ఉంది. చుట్టూ కాంపౌండుగోడ లోపల క్రోటన్సు సుందరంగా ఏర్పాటు చేయబడ్డాయి. మేమున్న బసకు ప్రక్కనే రిటైర్డు డాక్టరు రుక్మిణీ కాంతరావుగారు స్వంతంగా మంచి డాబా కట్టించుకొని కాపురమున్నారు. రెండూ డాబా ఇళ్ళే. పైకెక్కి చూస్తే కృష్ణవేణి కన్నుల పండువగా ప్రవహిస్తూంటుంది. మాఇంటిలోప దక్షిణమువైపు గదిలోనున్న కిటికీలోంచి చూస్తే రుక్మిణీ కాంతారావుగారి భవనము ఆయనకుమార్తె ఉషాదేవి చదువుకొనే గది దానికున్న పెద్దకిటికీ చక్కగా కనిపిస్తుంది.

నాభర్త ఉదయం ఏడుగంటలకే కాఫీతీసుకొని డ్యూటీ మీద వెళ్ళి మధ్యాహ్నం సుమారు ఒంటిగంట రెండుగంటలకు ఇంటికివచ్చి విశ్రాంతి తీసుకొని తిరిగి నాలుగు గంటలకు డ్యూటీమీద వెళ్తూంటారు. ఇంటిపనులు నౌకరు చేస్తూంటే మధ్యాహ్నకాలం నాకు విశ్రాంతిగా ఉంటుంది. ఆ సమయంలో పేసులల్లుకొంటూండడమో లేక చదువుకొంటూనో కాలము గడుపుతూంటాను. ఎప్పుడైనా లేచి దక్షిణంవైపు కిటికీలోంచి చూచేసరికి డాక్టరుగారి కుమార్తె ఉషాదేవి చదువుతూండే దృశ్యం కనపడేది. డాబామీదకు వెళ్ళినప్పుడామె

కూడా పైన నిలువబడి నావైపు తరుచుగా చూస్తూండేది. ఆకర్షణీయమైన శరీర సౌష్టవం చిరునవ్వులొలుకు ముఖంగల ఆ నవయౌవ్వనవతిని పలుకరించి ఆమెతో స్నేహసంబంధం ఏర్పరచుకోవాలని నాకు చాలా ఉబలాటంగా ఉండేది. కాని నాకుగా నేను సాహసించలేకపోయాను. మూడేండ్లనుండి డాక్టరు రుక్మిణీకాంతరావుగారు హృదయదౌర్బల్యము క్షయ వ్యాధితో బాధపడుతున్నారు. ఇంటిలో ఉషాదేవి, చిన్న వయస్సులో నున్న నౌకరు, వృద్ధదాసీగాక మరెవ్వరునులేరు.

ఆదినం శుక్రవారం. రాత్రి బండిలో వారొక రోగిని చూచుటకై గ్రామాంతరము వెళ్తూ ఉదయం ఏడున్నరబండిలో వస్తాననీ, కారు తీసుకొనిరమ్మని చెప్పి వెళ్ళిపోయారు. మాట ప్రకారం కారు తీసుకొని వెళ్ళి తొమ్మిది గంటలవరకు చూశాను. తరువాత ట్రైనులోకూడా రాలేదు. విసుగుదలతో ఇంటికివచ్చి పడకకుర్చీలో కూర్చుని 'లీడర్' అనే ఆంగ్ల మాసపత్రికను చదువుతున్నాను. టీ తాగడానికి బుద్ధి పుట్టలేదు. ఇంతలో గేటుతలుపులు చప్పుడైనాయి. ఎవరా అని ఆలోచిస్తుంటే తలుపులు గభాలున తెరచుకొని ఉషాదేవి గదిలో ప్రవేసించింది. వెంటనే లేచి ఆహ్వానించాను.

"కూర్చోండి. ఈనాడు మామీద దయవచ్చిందే! నావలన కావలసిన పనులుంటే చెప్పండి చేస్తాను.

"నన్ను మీరు గుర్తించారా?"

"గుర్తించకేమి? డాక్టరుగారి కుమార్తెగా మిమ్మల్ని

తెలిసికొని చాలా కాలమైంది. మీ పేరు ఉషాదేవి అనికూడా తెలిసికొన్నాను."

"డాక్టరుగారున్నారా?"

"వారు రాత్రి రైలులో వేరొక రోగిని చూడడానికి వెళ్లేరు. ఇంకా రాలేదు. బహుశా త్వరగానే రావచ్చును. పనేమిటి? ఎవరికైనా సుస్తీగా ఉందా?"

"ఏమీ లేదు. థర్మామీటరు కావలసి వచ్చాను. పోనీ లెండి మళ్ళీ వస్తాను. డాక్టరుగారు మీ తండ్రి గారా?"

"ఎవరన్నారు? మీరే ఊహించారా! లేక ఎవరైనా అన్నారా?"

'ఓహో! పొరపడ్డాను. క్షమించండి వారు భర్తగారా!'

నేను నవ్వేను.

"మీరు కొంచెము ఇంచుమించుగా నా వయస్సులో నున్నారు. మరి మీవారికో...పోనీలెండి ఇప్పుడా ప్రసక్తి ఎందుకు? మీ పేరేమో తెలిసికొనవచ్చునా?"

"నిరభ్యంతరంగా! నా పేరు లలితాకుమారి"

"నేను మళ్లా వస్తాను"

"ఉండండి టీతాగి వెళ్ళవచ్చును. వారు లేకపోవడం చేత ఒక్కదాన్ని తాగడానికిష్టంలేక మానుకున్నాను."

ఇద్దరం కలిసి పుచ్చుకొందాం.

తయారుగా వున్న టీ రెండు కప్పులలో పోసి ఒకదాని నామె ముందుంచాను. ఇద్దరము టీ తాగుతూ మధ్య మధ్య

మాట్లాడు కుంటున్నాము. మాట సందర్భంగా నేనామెనిట్లా ప్రశ్నించాను.

"మీరింకా వివాహం చేసుకోలేదా?"

ఉమ మాట్లాడలేదు.

"ఏదైనా కారణాంతరముచేతనా?"

"లేదండీ! ఇంకా అందుకు తగిన అవకాశం లభించలేదు. అదిగాక స్త్రీపురుషు హృదయాలు సమ్మేళనం కావడమే నిజమైన వివాహమని నా తలంపు."

"మీరు చెప్పింది నిజమే...కాని"

"లోకాచారాన్ని బట్టి వివాహం అవసరమని మీరు చెప్పతలచు కున్నారు. అయితే నేనొకటడుగుతాను. దానికి మీరిచ్చే సమాధానం లోనే నా సమాధానం కూడా ఇమిడి ఉంటుంది. మీరు మీ యిష్ట ప్రకారం వివాహం చేసు కొన్నారా! మీ యిర్వురి వయస్సులలో సుమారు పద్దెనిమిది సంవత్సరాలైనా భేదం ఉంటుంది గదా!"

"నా వివాహం నా తల్లిదండ్రుల ఇష్టప్రకారం జరిగింది. కాని నా యిష్టప్రకారం జరుగలేదు. అయినప్పటికీ మా యిరువురి మధ్య అసంతృప్తి కరములైన విషయాలులేవు. సంసారము సఖ్యతగానే జరుగుతోంది. వారి వయస్సుయొక్క అధిక్యత గూర్చి నాకెట్టి ఆలోచనయు లేదు."

"బాగానేఉంది! వదినెగారూ! ఈ దినాల్లో వేలకువేలు కట్నాలిచ్చి కన్యాదానాలు చేస్తున్నారే! ఇది మీకు విచారకరంగా లేదా?

"అది కాల పరిణామదశ. ఆ పద్ధతి మారాలంటే భగవంతుడే మార్చాలి. మనము విచారపడితే మాత్రం ఏం లాభం?"

నా ప్రత్యుత్తరం విని ఉషాదేవి ఆశ్చర్యంతో నావైపు చూసింది. వెంటనే లేచి 'వదినెగారూ! నేను వెళ్ళాలి. ఇంకో మారు కలుసుకుందాం. నమస్తే' అని చెప్పి లేడి పరుగెత్తినట్లు వెళ్ళిపోయింది.

* * * *

నాలుగు దినాలైన తర్వాత ప్రొద్దున్నే ఏడుగంటలకు టీ కలుపుతున్నాను. రుక్మిణీకాంతరావుగారి ఇంటివద్ద దాసి వచ్చి 'లలితాంబగారూ! ఉషాదేవి రాలేదా?' అని అడిగింది. ఆ అడగడంలో ఆదుర్దా కనిపించింది. నేను రాలేదని జవాబు చెప్పి సంగతేమిటి? అని అడిగాను.

"రాత్రి చాలా సేపటివరకు ఉష యింటికి రాలేదు. పడున్నాము. ప్రొద్దుపోయి వచ్చి గదిలో పడుందేమో ఏడు గంటలైంది లేవలేదు. లేపుదామని గది తలుపు తెరచి చూచాను. గదిలో లేదు. వెదకితే కనపడలేదు"

అని చెప్పి దాసి వెళ్ళి పోయింది. మావారు స్నానం చేసి హాస్పటలుకు వెళ్ళి డ్రెస్సు వేసుకొని వచ్చి కుర్చీలో కూర్చుండి టీ తాగుతూ నాతో అన్నారు.

"డాక్టరుగారమ్మాయి కనపడలేదని గల్లంతుపడుతున్నారు. నీకేమైనా తెలిసిందా?"

"ఆమె అట్లావెళ్ళే స్వభావం కలదికాదు. ఏదైన పనిమీద వెళ్ళిందేమో! శీఘ్రంగానే రావచ్చు."

"మీకిద్దరకు స్నేహము కాదూ?"

"అంత పెద్ద స్నేహంలేదు. మొన్న ధర్మామీటరు కోసంవచ్చి కొంతసేపు మాట్లాడివెళ్ళింది.

"ప్రసంగం దేన్ని గురించి?"

"ఏదో లోకాభి రామాయణం. మీరామెను చూచారా!"

"నిన్న మధ్యాహ్నం కురుపులమీద వేసే పట్టీకోసం వచ్చింది. ఇచ్చి పంపాను.

టీ తాగడం పూర్తిచేసి మావారు కారులో వెళ్ళిపోయారు. ఆదినమంతా నామనస్సులో ఉష ఎందుకువెళ్ళింది? ఎక్కడకు వెళ్ళింది? తండ్రీ రోగిష్టివాడుకదా? తాను యుక్త వయస్సు వచ్చిన యౌవనవతి. ఇట్టి స్థితిలో చెప్పకుండా వెళ్ళడం అగౌరవం కాదా? అన్నసంశయాలే చాలాకల్లోలం చేస్తున్నాయి. మరునాటి ఉదయం లేచి కిటికీ తలుపులు తెరచి చూతునుగదా! ఉషాదేవి గదిలో షికారు చేస్తోంది. నల్ల సిల్కుచీర కట్టింది. పూవులల్లబడిన బ్లౌజు [జాకెట్టు] తొడిగింది. కోటు బుజాలపై వేసుకొని తిరుగుతోంది. కిటికీ తలుపులు తెరచిన చప్పుడువిని తలెత్తి నన్నుచూచి నమస్కరించింది. నేను బదులు నమస్కారం చేశాను. ఎప్పుడు వచ్చారు అని అడిగాను.

"ఇప్పుడే వచ్చాను"

"నిన్న మీరు లేరని అంతా గాబరాపడ్డారు"

"మీరేమను కొన్నారు? పారిపోయా ననుకున్నారా? సదవకాశాన్ని చేజార్చుకున్నా ననుకున్నారా?"

"అట్టి అవసర ముండదని నా నమ్మకం. సదవకాశాన్ని చేజార్చుకోనక్కరలేదు. దాని కదే వెతుక్కుంటూ మీ కోసం వస్తుంది. అదే నేనూ ఆలోచిస్తున్నాను."

ఉష ముఖారవిందంలో మందహాసరేఖలు ప్రసరించాయి. అచంచలమైన భావం ఆమె ప్రదర్శిస్తూ మాట్లాడుతోంది.

"ఇప్పుడు చూశారుగా నన్ను? మీరే నిశ్చయానికి వచ్చారు?"

నేను సమాధానం చెప్పాలనుకొంటున్నా. ఇంతలో తండ్రిరావడం గమనించి ఉష నమస్కారంచేసి వెళ్ళింది.

* * *

ఆ దినం ఆదివారం. సాయంకాలం నాలుగు గంటలు దాటింది. మావారు, నేను పలహారం, తేనీటిపానం ముగించి షికారు వెళ్ళాలనే ప్రయత్నంలో ఉన్నాము. ఇంతలో డాక్టరు రుక్మిణీకాంతరావు గారింటి నౌకరు జాబొకటి తెచ్చి మావారి చేతిలో పెట్టేడు. ఆయన చదువుకుని సరే వస్తున్నామని చెప్పు అని వాణ్ణి పంపించారు.

"దేనికిరమ్మన్నారు?"

"కారణం వ్రాయలేదు. డాక్టరుగారు మనల్నిద్దర్నీ వచ్చి మాట్లాడి వెళ్ళమని వ్రాశారు."

"నన్ను కూడానా?"

"ఔను. ఉషాదేవి నీ స్నేహితురాలేగా! రా. వెళ్ళి సంగతేమిటో తెలిసికొని వచ్చేద్దాం"

ఇద్దరం కలిసి రుక్మిణీకాంతరావు గారింటికి వెళ్లేము. నౌకరు లోపలికి తీసుకుని పోయాడు. డాక్టరుగారు సగౌరవంగా మమ్మల్ని కుర్చీలో కూర్చుండపెట్టి ఇట్లా మాట్లాడేరు.

"డాక్టరుగారూ! ఆ సమయంలో మిమ్మల్ని శ్రమపెట్టినందుకు క్షమించాలి."

"పెద్దలు మీరట్లా అనవద్దు. నన్ను మీ వాణ్నిగా భావించండి. నావలన కావలసిన పనేమో చెప్తే చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను. కొన్ని తొందరలచేత మిమ్మ కలవలేను."

"జరువురుపనేమి కాదు. కొన్నిముఖ్యాంశాలు మీతో చెప్పాలని పిలిచాను. అమ్మాయీ! నేను రోగిని. నెమ్మదిగా మాట్లాడుతాను. నాకెదురుగా దగ్గిరిగా కూర్చో.

నేను నాకుర్చీని వారి కెదురుగా లాక్కుని కూర్చున్నాను.

"మా అమ్మాయి ఉషకు నీకు స్నేహమనుకుంటాను:"

"ఎక్కువ పరిచయంలేదు. కొద్ది దినాలనుండే."

"నాకు తెలుసునమ్మా! సమాన వయస్సుగల ఇద్దరు స్త్రీలకు స్నేహం కలిస్తే కడుపులోని రహస్యాలను చక్కగా వెల్లడించుకుంటారు. మా ఉషకూడ అట్టిదే. స్నేహంకలిస్తే తన కడుపులో ఏమీ దాచుకోదు. దాని హృదయాభిప్రాయం కొంతవరకైనా మీకు చెప్పి ఉంటుందని ఊహిస్తాను."

"ఇంతవరకు మా ప్రసంగాల్లో ఆంతరంగిక విషయాలేమీ లేవు. అన్నియు లోక వార్తలే. ఉష లోపలఉందేమో ఒకమారు పిలుస్తారా!"

"ఇంట్లో లేదు. ప్రొద్దున టీ తాగి వెళ్ళింది. ఇంతవరకు రాలేదు. (కొంత ఆయాసం తీర్చుకుని) ఇంట్లో తల్లి లేదు. దాని మంచి చెడ్డలను గమనించడానికి అక్క చెల్లెండ్రు అన్నదమ్ములు ఎవరూ లేరు. నేను రోగగ్రస్తుణ్ని. అందుచేతనే అవసరం వచ్చింది. నేను ఉన్నా లేనివాణ్నే. నేను పోయేలోగా ఉషకు వివాహంచేసి నాకర్తవ్యాన్ని నెరవేర్చుకొందామనుకొన్నాను. కాని పరిస్థితులు చూస్తే నా తుది కోర్కె తీరదనే తోస్తోంది. ఇదివరలో ఉషను లండనులో విద్యాభ్యాసం చేసే ఒక ధనవంతుడైన యువకుని కీయాలని నిశ్చయించాను. ఆ బల్లమీదఫొటో ఆ పిల్లవానిదే. చూడవచ్చును. ఉషకుమాత్రం నా అభిప్రాయం నచ్చలేదు. తన స్వేచ్ఛావిహారం వదలలేదు. అక్కడికీ ఒకమాటు కూర్చోపెట్టి అడిగేను. దానికి ఆమె నాన్నా! నీ కూతురు నీ కపకీర్తివచ్చే పనిచెయ్యదు. నమ్మండి అని చెప్పింది. ఈ నెలాఖరుకు వస్తున్నాను. ముహూర్తం పెట్టించండని అతను ఉత్తరంవ్రాశాడు.

నిన్ను కోరేదేమంటే ఈ సంబంధానికి మాఅమ్మాయిని అంగీకరింపచెయ్యడం. తరువాత ఆమె అభిప్రాయాన్ని తెలుసుకోవడం. ఇది నీవుచెయ్యవలసిన పని."

తరువాత నేను ఆ పిల్లవాని ఫొటోతీసి, చూశాను స్వరూపంలో ఆరోగ్యంలో ఎంతమాత్రము లోటు లేదని గ్రహించాను. ఆమె ఎందుకు తిరస్కరించిందా? అని అనుమానం కలిగింది. తరువాత ఆయనతో—

"బాబుగారూ! మీరు అంతగా ఆలోచించకండి. నేను ఉషను కలిసి మాట్లాడుతాను. ఆమె వస్తే నాకు కబురు చెయ్యండి."

అని చెప్పి యిశ్వరం బయలుదేరి పికారుకు పోయినాము. తరువాత వారము దినములవరకు నేనామెను కలవలేకపోయాను. ఒకనాటి సాయంత్రం దీపాలు పెట్టేవేళ ఉష ఒక యువకునితో మాట్లాడుతూ వెళ్ళడం చూశాను. అతడామెను ఆనుకుని నడుస్తున్నాడు. అతని చేతిని ఉష పట్టుకుని తీసుకుని వెళ్తూంది. తండ్రి అభిప్రాయానికి వ్యతిరేకంగా ఈ యువకుని ప్రేమించి ఉంటుందని ఊహించాను.

ఆదినం సాయంత్రం నా భర్తగారివలన రుక్మిణీకాంతరావుగారి పరిస్థితి బాగుగా లేదని ముగింపులోకి వస్తున్నదని విని వెంటనే చూడబోయినాను. ఆయన పరున్నాడు. ఉష దగ్గిర కుర్చీలో కూర్చుంది. దగ్గిరగా వెళ్ళి కూర్చుని పలకరించాను.

"నాన్నగారి కేట్లావుంది."

"సరిగా చెప్పలేను. డాక్టరుగారుమాత్రము భయము లేదంటారు. మనకేం తెలుస్తుంది. ఇంతకుముందే నిద్ర పట్టింది."

"నేను మీతో కొన్ని ముఖ్యాంశములను మాట్లాడ దలచుకొన్నాను."

"నాతోనా!అయితే కొంచెంసేపు కూర్చోండి స్నానము చేసి వస్తాను. ఆ ముఖ్యాంశమేమో నేను గ్రహించాను. కాని ఇట్టి అవసర విషయాలతో మనస్సు పాడు చేసుకో డం నాకిష్టంలేదు. నేను స్నానంచేసి వస్తాను. టీ తాగుతూ మాట్లాడుదాం. అంతవరకు మీరీ ఆల్బం చూస్తూండండి."

అనిచెప్పి ఫోటోలు కొన్ని ఆయిల్ పెయింటింగ్సు ఉన్న ఫైలును (ఆల్బం) నా చేతిలోపెట్టి ఉష దంతపు దువ్వెనతో తల దువ్వుకొంటూ లోపలికి వెళ్ళింది. ఆల్బం తెరచిచూ శాను. దానిలో ఉష ఇరవైరకాల పోజులతో ఫోటో తీయిం చుకున్నది. తరువాత రెండు డజన్ల ఆయిల్ పెయింటింగు చిత్రాలున్నాయి. నిర్జీవమైన కాగితముపై చిత్రింపబడిన యూపకీవ చిత్రాలు నా హృదయాన్ని లాగివేశాయి. అట్లాగే చూస్తూ తన్మయురాలనై పోయాను. అన్నిటిక్రింద 'మధుసూదన' అను పేరు వ్రాయబడి ఉంది. ప్రతి చిత్రం లోనూ జీవితముయొక్క నిమ్నోన్నతదశలు చక్కగాచిత్రించ బడ్డాయి. ఈశ్వరీయ ప్రాకృతిక సౌందర్యము ఎంత అద్భు తంగా చిత్రించి రసికజనుల సంపూర్ణసానుభూతిని పొందగల్గిన

మీ శిల్పికెన్ని వందనా లర్పించినా చాలదనే తోచింది. పది నిమిషములకు ఉష మాటతో నా దృష్టి మరలింది.

"వదినెగారేదో సావధానంగా చూస్తున్నారే?"

"ఈసుందర చిత్రాల్ని నిర్మించిన కళాకారుని కల్పన వర్ణనాతీతం."

"కళాకారుని కల్పనంటారా ! కళయొక్క కల్పనం టారా?"

"పరిపూర్ణుడైన కళోపాసకునకు కళ ఎప్పుడు స్వాధీను రాలే. అప్పుడా కళోపాసియొక్క కల్పన ననుసరించే కళ ప్రతి బింబితమౌతూంటుంది. ఇట్టి సర్వాంగ సుందర చిత్రాల్ని నిర్మించిన మహాత్ముడైన యా శిల్పి పూజనీయుడని నా తలంపు."

"ఇప్పటికి కళకన్న కళాకారుడే అధికుడని మా నిశ్చ యము."

"అవశ్యము ఉషాదేవీ. కళ ఈశ్వరీయతేజము. కళా కారుడీశ్వరుడు. సృష్టిలోని ప్రతి అణువులోనూ కళావ్యా ప్తమై ఉంటుంది. దాని విలువను మర్మజ్ఞుడైన కళాకారుడే గ్రహించాలి గాని ఇతరుల కెట్లా సాధ్యమౌతుంది? ఈమధు సూదన మహాశయుని మీ రెఱుంగుదురా?"

"ఆహా! ఎఱుగుదును. నాన్నగారు నిద్రపోతున్నారు. వచ్చేలోగా టీ తాగి వద్దాం రండి."

ఇద్దరం లోపలికి బోయి రౌండు టేబిల్ ముందు కూర్చుండి టీ తాగుతూండగా నే నే ప్రసంగం కదిలించాను.

"ఉషాదేవీ! నా వచ్చినపని ప్రారంభించనా!"

"వదినగారూ! నాకు తెలుసు. మా తండ్రిగారు నాతో తమ అభిప్రాయాన్ని వెల్లడించకుండా దాచారు. ఇదే పొరపాటు. మూడేండ్లక్రిందట చెప్పినట్లైతే సంతోషంగా నే నాతనిని భర్తగా అంగీకరించి ఆనందపడేదాన్ని. ఇప్పుడో! సమయం మించిపోయింది... ఊహుఁ. ఇప్పుడా ప్రసంగాన్ని ఆపండి. దానిసంగతింకోమారు చెప్తాను."

ఇద్దరం టీ తాగి రుక్మిణీ కాంతరావుగారి దగ్గరకు వచ్చాము. నాలుగు నిమిషాలు కూర్చుని నేను వెళ్ళిపో యాను. మరునాడు రాత్రి తొమ్మిది గంటలకు రుక్మిణీకాంతు నకు ఆకస్మికముగా హృదయస్పందన మాగుటచే చనిపోయి నాడు. మేమిద్దరం వెళ్ళిచూశాము. ఉష తండ్రి కళేబరం మీదపడి విలపిస్తోంది. చాలకష్టంమీద నేను పట్టుకుని ఆవ లికి తీసికునిపోయి ఊరడించానుకాని ఆమె దుఃఖము ఆగలేదు.

◆ ◆ ◆

డాక్టరు రుక్మిణీకాంతరావుగారు చనిపోయి సుమారు మూడు నెలలైనది. ఆయన సంపత్తికి ఉషయే ఉత్తరాధి కారిణి. ఒకనాడు మధ్యాహ్నం సావిట్లోకూర్చుని దిండుగలీబు మీద పువ్వులు కుట్టున్నాను. ఉష వచ్చింది.

"నమస్తే వదినగారూ!"

"నమస్తే ఉషాదేవీ! కూర్చో కులాసాగా ఉన్నావా?"

"ఈశ్వరానుగ్రహం వలన క్షేమమే. ఒక ముఖ్య విష యం గురించి మిమ్మల్ని ఆహ్వానింపవచ్చాను."

"ఏమిటది?"

"రేపు పగలు పదకొండు గంటలకు నా వివాహము. సాయంకాలము జరుగబోవు అల్పాహారానికి రాత్రి జరుగబోయే విందు భోజనానికి మీరు తప్పకుండా రావాలి. ఈ సంగతిని మా అన్నగారితో చెప్పి దంపతులిద్దరు రావాలని కోరుతున్నాను."

ఉష మాటను విని నేను నిర్ఘాంతపోయాను.

"ఉషాదేవీ! తప్పక వస్తానుకాని, నీభర్తగారి పరిచయమైనా మాకు కలిగించలేదు. పేరైనా చెప్పలేదు."

"అన్ని విషయాలు రేపు తెలుస్తాయిగా! తప్పకరండి."

మర్నాడు ఇంటిపనులు పూర్తిచేసుకుని నేను వెళ్లేసరికి వివాహం ముగిసింది. కార్యక్రమం అంతా ఎట్టి ఆడంబరాలు లేకుండానే చాలా క్లుప్తంగా ముగిసింది. ఉష విందు ఏర్పాటులో మగ్నురాలై ఉంది. నేనే వెళ్ళి కలుసుకొని పలకరించాను.

"ఉషాదేవీ! నీవివాహంనాడుకూడా నువ్విట్లా తిరగడం బాగుగాలేదు. నిన్ను నాచేతిమీదుగా అలంకరించేస్తాను. చక్కగా అలంకరించుకొని కూర్చో. నీ పనంతా నేనుచూస్తాను."

"మీరలంకరిస్తారుగాని నా అలంకారాన్ని ఎవరుచూడాల్సినవారు చూడలేరు. మీరు పడే కష్టమంతా వ్యర్థం. ఇంకా స్పష్టపరుస్తున్నాను. నా భర్త అంధుడు."

"అంధుడా! నిజమా! నాన్నగారి మాటనుకూడ త్రోసి వేసి చివరకు అంధుని భర్తగా వరించావా? నేను నమ్మలే కుండా ఉన్నాను ఉషా!"

"నామాట నమ్మలేకపోతే లోపలికి రండి పరిచయం కలుగచేస్తాను. అప్పుడైనా నమ్మకపోతారా?" అంటూ నా చేయి పట్టుకుని తన తండ్రిగారి గదిలోకి తీసుకొని వచ్చింది. ఒకవైపున వివాహవేదిక ఏర్పాటు చేయబడింది. ఎదురుగ నున్న గోడకు తండ్రిగారి ఛాయాచిత్రము పూలదండలతో అలంకరింపబడి వ్రేలాడుతోంది. పక్కనున్న కుర్చీలో ఒక తరుణ వయస్కుడు కూర్చుని పూవులు దవనంతో కట్టిన తురాయిక వాసన చూస్తున్నాడు. కళ్ళకు జోడుంది. చూడగానే ఆనాడు ఉషతో కలిసి మాట్లాడుతూ వచ్చిన వాడితడే అని గ్రహించాను. నాకు చాలా విస్మయం కలిగింది. ఉష తన భర్తచేయి పట్టుకుని 'ఈమె మా స్నేహితురాలు లలితా కుమారిదేవి. హాస్పటలు డాక్టరు మిష్టరు రావుగారి భార్య' అని నా పరిచయం వారికి కలిగించి నావైపు చూచి.

"వదినెగారూ! వీరే నాభర్తగారు మధుసూదనరావు గారు. ఆ దినం మీరు చూచిన కళాకల్పనయంతయు వీరిదే."

నాకు శరీరం ఝల్లుమన్నట్టయింది. ఉషాదేవి నా ఆశ్చర్యం గమనించి యిట్లా అన్నది. 'వదినే! ఆశ్చర్యమే ముంది? కళాకారుని వశవర్తిని అని మీరన్నారు కాదూ?' అని గర్వంతో చిరునవ్వు నవ్వింది. నే నన్న మాటకు నేనే పరాజితురాలనైనాను.

"వదినెగారూ! మిగతా సంగతి వినండి. మీ సందేహ నివృత్తి ఔతుంది. ఈయన జన్మాంధుడుగాడు. సుమారు పద్నాల్గు మాసాల క్రిందట కారణాంతరాలచేత దృష్టిలోపం కలిగింది. నాకు చిరకాలంనుండీ చిత్రకళ నేర్చుకోవాలని ఉండేది. వీరు సుప్రసిద్ధ చిత్రకారులని విని వారిశిష్యురాలనై ఆవిద్య నేర్చుకున్నాను. నీవు చూచిన చిత్రాల్లో కొన్ని నా చేత వారు వ్రాయించినవే. అందుచేతనే వానిలోకూడా వారి ప్రతిభయే ప్రతిబింబిస్తూ వుంటుంది. రాను రాను పరిచయం అనురాగంగా మారింది. దాని ఫలితంకూడా అనుభవించాను. తరువాత దైవేచ్ఛవలన వారికి నేత్రదృష్టిపోయింది. ఇట్టి స్థితిలో ఆ కళోపాసకుని జీవితం సక్రమంగా గడవాలంటే ఆయన తత్వం తెలిసికొన్న నావంటి భార్య చాల అవసరం. నాన్నగారేర్పాటు చేసిన వరునకు భార్యలకేమీ లోటులేదు. అనేకమంది రంభలవంటి తమ పిల్లల నాయన పాదాలమీద పడేస్తారు కాని ఒక నేత్రహీనుడైన కళాకారు హేకన్య వరిస్తుంది? ఎవరు పిల్లనిస్తారు? లోకంలో కన్యాజనకులు ధనాన్ని వైభవాన్ని చూస్తున్నారు. లక్షాధికారులకే వేలకువేలు సమర్పిస్తున్నారు. ఫలితమేమగునది? అల్లుడు మామను గడ్డిపోచతో సమంగా చూస్తాడు. చివాట్లు అసంతృప్తి మాటలు అగౌరవము కలుగుతోంది. డబ్బెట్టి తద్దినం తెచ్చికోవడమంటే ఇదే. ఆ వేలుపెట్టి ఒక నిరుపేద విద్యార్థి జీవితాన్ని బాగుచెయ్యడానికి ప్రయత్నించరు. అట్టి బుద్ధి పుట్టదు. లోకంలో విద్యా గౌరవములు సత్ప్రవర్తనము మొదలగు

వానికి స్థానంలేదు. కనుక నేనాయననే భర్తగా నిశ్చయించు కొన్నాను.

తొలిసారి గురువుగా భావించి శిష్యురాలనై పూజించాను. ఇప్పుడు భార్యనై ప్రేమిస్తున్నాను. ముందుముందు భక్తురాలనై భగవంతునిగా భావిస్తానేమో చెప్పలేను. ఇట్టి మహాత్ముని పతిగాబొందింది కృతార్థురాలనైతినని నావిశ్వాసము.'

ఆమె మాటలను విని నేను కన్నీరు కార్చాను. గాఢాలింగనం చేసుకుని ఇట్లా అన్నాను.

"ఉమాదేవీ! నీ త్యాగానికి నీ ధృడసంకల్పానికి నావందనాలు. భగవంతుడు నీ పవిత్రాశయాన్ని పాలించి నీ సౌమంగల్యము చిరస్థాయిగా ఉంచుతాడని నా నమ్మకము."

ఉమాదేవి నన్ను ప్రత్యాలింగనం చేసి "వదినెగారూ! ఇది త్యాగం కాదు. నాకర్తవ్యం చనిపోయేముందు నాన్నగారికి సంగతి అంతా చెప్పి వారి ఆశీర్వచనం పొందేను. మీరుకూడా నేను సర్వదా నా స్థానాన్ని వదలకుండా నా కర్తవ్యాన్ని మరచిపోకుండా ఉండాలని దీవించండి." అంటూ నాబుజాలమీద తలపెట్టుకుని కన్నీరు కార్చింది.

---

# సపత్ని కొడుకు ప్రేమ

ఇదిగో! ఇట్లా చూడు. నా మాటంటే నీకు లక్ష్యం లేకుండా పోయిందేం? మనస్సును పాడుచేసి పెడదోవలో పెట్టే నాటకాలు, నవలలు, మాస పత్రికలూ చదవద్దని ఎన్నిసార్లు చెప్పినా నువ్వు వినటంలేదు. ప్రతిదినం ఉదయం లేవగానే వంటచేసి మన ప్రసాదానికి సీతకు అన్నం పెట్టి బడికి పంపించు. చిన్న పిల్లలు భోజనం చెయ్యకుండా బడికివెళ్తే ఉండలేక బాధపడతారు. తరుచుగా వాళ్ళకు తల దువ్వి వారానికి ఒకమారైనా తలంటినీళ్లు పోస్తూండు. వాళ్లు అమ్మా! అని దగ్గరకువస్తే కసరి కొట్టక చేరదీసి లాలించాలి. లేకపోతే తల్లిపోయిన దుఃఖం జ్ఞాపకంవచ్చి కుమిలిపోతారు. మాతృస్థానంలోఉన్న నువ్వు వాళ్ళకు తల్లిలేనిలోటురాకుండా కాపాడాలి తెలిసిందా!

శ్రీనివాసులు ఈవిధంగా తన ద్వితీయ కళత్రమైన పార్వతికి బోధించి వీధి అరుగుమీదకు వెళ్ళిపోయాడు.

పార్వతి తాను చదువుతూన్న పుస్తకం అట్లాగే పట్టుకుని పెనిమిటి చెప్పిన మాటలన్నీ విన్నది. అతను వెళ్ళిన తర్వాత తనలో తానిట్లా అనుకుంది. ఇదెక్కడి ప్రేమ? ఈ అనురాగం ఏమిటో నాకర్థం కాలేదు. మగవారికి రెండవ భార్యమీద చాలా అనురాగం, మమకారం, ప్రేమ ఉంటాయని నవలలో చదివాను. అనేకమంది పెద్దలు వృద్ధులుకూడా

ఇట్లాగే చెప్పగా విన్నాను. కాని ఈయన కా లక్షణం ఉన్నట్లు లేదు. అంతా కొత్తగా ఉంది. ఎంతసేపూ పిల్లలగొడవే గాని నాసంగతి ఏమీ ఆయనకు పట్టటంలేదు. ఇంతలో పని చేసే వీరమ్మవచ్చి ఇట్లా అన్నది. "బడికి వెళ్ళే వేళైంది. ఇంకా వంటలక్క వంట చెయ్యలేదు. అడిగితే ఇప్పుడే కూర తరుగుతున్నాను పచ్చడిలోకి చింతపండు లేదు ఏంచెయ్యను? అని అన్నది.

వీరమ్మ మాటకు పార్వతి "చూదాంలే" అని జవాబు చెప్పింది. ఆమాటవిని వీరమ్మ వెళ్ళిపోయింది.

ఆఖరికి ఆదినం సీత, ప్రసాదం ఇద్దరూ అన్నం తినకుండానే బళ్ళోకి వెళ్ళిపోయారు.

పిల్లల పరిస్థితి చూచి శ్రీనివాసులు కళ్ళనీళ్ళు పెట్టుకొని ఇట్లా అనుకొన్నాడు. "వాళ్ళ తల్లి వుంటే ఈనాడు పిల్లల స్థితి గతులను చూచి ఎంత దుఃఖపడేదో. ఎన్నిసార్లు చెప్పినా నామాట ఒకసారైనా వినిపించుకోడంలేదు. ఇంతకూ మాఅమ్మ పట్టుదల ఇంతవరకు తెచ్చింది. ఆవిడ పోరుపడలేక రెండో పెళ్ళి చేసుకొన్నందుకు ఫలితం అనుభవిస్తున్నాను. ఇంత చేసినా పిల్లలకు సుఖం లేకుండాపోయింది. తగిన పోషణలేక చిక్కిపోతున్నారు."

పెనిమిటి కన్నీళ్ళు విడవటం చూచి పార్వతి వెంటనే వంటింట్లోకి వెళ్ళింది. లోపల వంటలక్క లేదు. ఇంట్లోవంట ప్రయత్నాలు కనపడకపోవడంచేత ఆమె ఆనాటి జల్తానిగు తీసుకొని వెళ్ళిపోయింది. తప్పుమరా భగవంతుడా! అని

కొని పార్వతి నానా అవస్థలు పడుతూ విసుగుతో ఎట్లాగో వంట పూర్తిచేసి దానితో పాటు హల్వాకూడా తయారుచేసి కంచంలో పెట్టి పెనిమిటికోసం తీసుకొనివచ్చి ఎదురుగా వుంచింది. శ్రీనివాసులు దానిని చూచి ముఖం తిప్పుకొని ఇట్లా అన్నాడు "పిల్లలు కడు పెడాకలితో స్కూలుకు వెళ్ళిపోయారు. వాళ్లు అనుభవించకుండా నేను అనుభవించలేను. నాకు అక్కర లేదు."

శ్రీనివాసులకు స్వర్గస్తురాలైన తన గృహలక్ష్మి, ప్రథమ కళత్రం జ్ఞాపకానికి వచ్చింది. ఆమె ఉనికి జబ్బుతో ఉండటం తరువాత చనిపోవడం మొదలైన విషయాలు కన్నుల గట్టినట్లు కనపడ్డాయి. తదుపరి విద్యావతి, సుశిక్షిత, రూపవతి అయిన స్త్రీని తిరిగి వివాహం చేసుకొని ఇంటికి తెచ్చుకొన్నాడు. అయితే ఏమి? ఇంటి పరిస్థితి పిల్లల భవిష్యత్తు శాంతితో గడిచే లక్షణాలేమీ కానరాలేదు. ఇంట్లో పార్వతి గృహలక్ష్మిగా అవతరించినప్పటికే ఇల్లు భూతగృహంవలె భయంకరంగానే ఉంది. మేళతాళాలతో పెళ్ళిచేసుకోవడం మూలంగా ద్వితీయ కళత్రం అనే సంకెళ్ళను కాళ్ళకు తగిలించుకొన్నట్టయింది. అనుకూలవతి అయిన భార్య దొరకడంకూడా గొప్ప అదృష్టమే.

మొదటి భార్య సుశిల చనిపోయిన తర్వాత శ్రీనివాసులకు విచారంతో పాటు పిల్లల నిద్దరిసీ సాకడంకూడా చాలాకష్టమైంది. ఎంత కష్టంగాడున్నా తల్లి ఎంతబోధించినా రెండో వివాహానికి అతను అంగీకరించలేదు. ఇరుగు పొరుగు వారిచేత

తల్లి ఎన్నోవిధాల బోధచేయించినమీాదట పిల్లల కష్టంచూచి పార్వతిని వివాహం చేసుకొన్నాడు.

పార్వతి చదువుకొనే దినాల్లో పాఠశాలలో మంచి శిక్షనే అభ్యసించింది. అత్తవారింటికి కాపురానికి వెళ్ళిన కోడండ్ర కర్తవ్యం గురించి ఉపాధ్యాయిని క్లాసులో చెప్తూంటే పార్వతి అనేకసారులు విన్నది. కాని కాపరానికి వచ్చిన తరువాత ఆశిక్ష అంతా ఆమె కడుపులోంచి మాయమైపోయింది. ఉపాధ్యాయిని చెప్పిన ఉపదేశమంతా ఆమెకే గురుదక్షిణకింద సమర్పించింది పార్వతి. తెల్లబట్టను రంగునీళ్ళలో ముంచితే ఆరంగు ఎంతోకాలం ఉండదు. రెండుమార్లు చాకలికి వెయ్యగానే ఆబట్ట యధాస్థితికి వస్తుంది. అదేవిధంగా చిన్నప్పటి నుండి తల్లిదగ్గిర సుశిక్షితగాని పార్వతికి పంతులమ్మ ఇచ్చిన ఉపదేశం ఏమీా పనిచెయ్యలేదు. బంగారం కరిగితేనేగాని వస్తు స్వరూపంలోకి రానివిధంగా కష్టాలు అనుభవిస్తేగాని మనుష్యులు మంచిస్థితికి రారు.

పార్వతి అత్తవారింట్లో అడుగు పెట్టిందిమొదలు అలంకరించుకోడం, సన్నగా అందంగా ఉండే దుస్తులు వేసుకోడం పడకకుర్చీలో కాళ్ళు చాచుకుని పరుండి నవలో, నాటకమో, ప్రేమకథలో చదువుకొంటూండడం తన కర్తవ్యమనుకొంది. వంటకు వంటలక్క, ఇంటిపనికి దాసి వీరమ్మ కుదిరేరు. ఆమెకు ఏవిధమైన పని చేయవలసిన అవసరం లేకపోయింది.

◆ ◆ ◆

పార్వతియొక్క ఉపేక్షచేత పిల్లల పోషణలో లోటు

వచ్చింది. వాళ్ళకు వేళకు సరియైన ఆహారం లేకపోవడంచేత వాళ్ళ లేతముఖాలు వాడిపోయినాయి. క్రమ క్రమంగా దినాలు గడుస్తున్నకొద్దీ యజమానురాలి గర్వం, చిరాకు మొదలగు లక్షణాలుచూచి వంటలక్క, పనిమనిషి ఇద్దరూ మెల్లగా సర్దుకొని ఇంకోఇల్లు చూసుకొన్నారు. అయినప్పటికీ పార్వతి భావాలు మారలేదు. మామూలు పద్ధతిగా నవలలు నాటకాలు మాసపత్రికలు చదవడంలో మగ్నురాలైంది. గతిలేక శ్రీనివాసులే స్వయంగా వంటచేసుకొని పిల్లలకుపెట్టడం సాగించాడు. ఎంత తంటాలుపడ్డా పిల్లలను సాదుకురావడం ఆడుదాని పనిగాని మొగవాడేం చేస్తాడు. ఎంతవరకు పోషిస్తాడు? జనని లేకపోతే జగమే లేదని ఒక కవి అన్నాడు. అదెంత అనుభవంగలమాట!

శ్రీనివాసునకు శరీరశ్రమ అధికమైంది. ఒక్కొక్క నాడు వండలేకపోతే ప్రసాదం తనకు తండ్రి అప్పుడప్పుడు ఇయ్యగా దాచుకొన్న డబ్బులు తీసుకొని దుకాణంలోకి వెళ్ళి నూనెతోచేసిన అనారోగ్యకరమైన మిఠాయి మొదలగునవి కొనితెచ్చుకొని చెల్లెలికి పెట్టి తానుతిని ఆకలి చల్లార్చుకొనేవాడు. అట్లా తినడం అజీర్తి విరోచనాలకు కారణం అయింది.

పార్వతికి సోమరితనం నానాటికి అధికమైంది. చేతులార వంటచేసి పతికీ పిల్లలకుపెట్టడం అంటే విసుగుదల బద్దకం [illegible]రిపోతోంది. దానికితోడు లోభగుణం ప్రవేశించింది. శరీరానికి తగిన పరిశ్రమలేక వంటమాని బజారులోని దుష్ప

దారవములను తింటూ కృత్రిమ శృంగారం పూర్తిచేసుకొని కుర్చీలో కదలకుండా కూర్చోవడం ఎక్కువైనకొద్దీ పార్వతికి గ్రహణిరోగం ప్రారంభమైంది. ఇదివరకే పిల్లలిద్దరూ తిండితిప్పలు లేక మంచం ఎక్కేరు. ఇప్పుడు పార్వతి కూడా మంచమెక్కింది. శ్రీనివాసులకు పట్టిన మనోవ్యాధి అపారమైంది. పిల్లల రోగచికిత్సతో అతను నానాబాధపడుతూంటే పండుమీద రోకలిపోటువలే భార్యా రోగంకూడా అతనికి చెప్పరాని కష్టకారణం అయింది. ఇంట్లో ఉన్న డబ్బంతా మందులకోసం ఖర్చుపడింది. పథ్యపానాలకుగా వ్యయమైపోయింది. పాపము ఏమిచేస్తాడు? ఒంటరిగా కూర్చుని "నాతల్లి చచ్చిపోతూ నాకీ నరకం తయారుచేసి నన్నిందులో కూలదోసిపోయింది" అని చెప్పి రోదనం చేసేవాడు. ఈ ద్వితీయ వివాహం నా జీవితాన్ని సర్వనాశనం చెయ్యడమే గాక నా ఇంటిని నట్టేటిలో కలిపిందని తన స్నేహితులతో చెప్పుకొని దుఃఖపడుతూండేవాడు.

ప్రసాదమునకు రానురాను హృదయకోశము కుంచించిపోయి ముఖమంతా రక్తహీనమై పాలిపోయింది. గుండెలు ఆడిపోవడం కడుపు పైకిరావడం మొదలుపెట్టేయి. ఆకలి మందగించిపోయింది. స్కూలు చదువు ఏనాడో పోయింది. రానురాను రోగం అధికమైనకొద్దీ జీవితమే ఆపిల్లవానికి భారమైపోయింది.

చేతులో ఉన్నధనం అయిపోవడంచేత మం... పథ్యం ఎట్లా నడుస్తోందో తెలియక శ్రీనివాసులు బెంగప...

పోయాడు. ఊరిలో ఎంత మర్యాదఉన్నా ఇంట్లో ఏమీ సారం లేకపోవడంచేత పరపతి పుట్టకం తగ్గిపోవడంచేత వేరు గతిలేక భార్యతాలూకు నగ ఏదైనా ఒకటి అమ్ముదామని ఆలోచించాడు. కాని పతి అభిప్రాయాలను శ్రద్ధతో గమని స్తూన్న పార్వతి ఆవిషయాన్ని తెలుసుకొని తాచుపామువలె కోపంతో బుసలుకొట్టడం ప్రారంభించింది. శ్రీనివాసులు గ్రహించుకొని ఊరుకొన్నాడు. డాక్టరుకు ఫీజుముట్టడం తగ్గి పోవడంచేత కారణం ఏమో తెలుసుకొందామని శ్రీనివాసులు ఇంటి పరిస్థితులనుగూర్చి దర్యాప్తు చేసేసరికి అసలు సంగతి బయటపడింది. ఆదినం బయలుదేరి వెళ్ళి కొంతసేపుకూర్చుని రోగులను పరీక్షించిన పిదప అచ్చటి వాతావరణం అంతా చూచేసరికి డాక్టరుగారికి జాలికలిగి శ్రీనివాసులతో ఇట్లా అన్నాడు. "మరేమీ భయపడకండి. పిల్లలకు ఆరోగ్యం కలిగేవరకూ వారిభారం నామీఁగ ఉంచండి వారి ఆహార వ్యవ హారమందు వగైరా విషయం అంతా నేను చూసుకొంటాను. మీకు చేతులో ఉన్నప్పుడే నాకు ఫీజు ఇయ్యండి. నాకేమీ తొందరలేదు. వైద్యులకు చికిత్స చేయడమే పరమార్థంగాని సమయా సమయములను గుర్తించకుండా డబ్బుకోసం పీడిం చడం వారి ధర్మంకాదు మీరు ధైర్యంగా ఉండండి" అని చెప్పి డాక్టరు వెళ్ళిపోయాడు. గ్రీష్మఋతువులో మధ్యాహ్న కాలంలో ఎడారిలో ఎండపడి ప్రయాణం చేసేవాడికి చెట్టునీడ దొరికితే ఎంత సంతోషపడతాడో అంత సంతోషం శ్రీని వాసులుకు వచ్చింది. పిల్లలభారం డాక్టరుగారు వహించడం అతనికి నెత్తిమీద బరువు కిందకుదింపినట్లైంది. కొద్ది దినాకే

పిల్లల ఆరోగ్యం చక్కబడ్డది. డాక్టరుగారి శ్రద్ధా పూర్వకమైన చికిత్సవలన ప్రసాదం జబ్బుత్వరలోనే తగ్గిపోయింది. శ్రీనివాసులు సంతోషం పట్టలేక డాక్టరుగారికి ఎన్నో కృతజ్ఞతా పూర్వక వందనాలు సమర్పించడమేగాక ప్రతిదినం మూడు పూటల డాక్టరుగారు దీర్ఘాయుష్మంతులై ఉండాలని భగవంతునికి సాష్టాంగ పడుతూండేవాడు.

పిల్లల జబ్బు తగ్గినా డాక్టరు శ్రీనివాసులు ఇంటినివదలి పెట్టలేదు. పార్వతికి జబ్బు రాను రాను హిస్టీరియాలోకి దింపింది. ఉండుండి ఫిట్సు [మూర్ఛలు] రావడం ప్రారంభిచాయి. ప్రసాదానికి జబ్బు తగ్గినా బడికి వెళ్ళటంలేదు. వేళకు నిద్రాహారాలుకూడా మరచిపోయి సవతి తల్లికి సేవ చేయడం సాగించాడు.

ఒకనాడు శ్రీనివాసులు డాక్టరును తీసుకొని ఇంటికి వచ్చేసరికి ఇంట్లో గందరగోళంగా ఉంది గదిలోకిపోయి చూడగా పార్వతి మూర్ఛవచ్చి పడిపోయింది. పొరుగున ఉన్న స్త్రీ వచ్చి ఏవో ఉపచారాలు చేస్తోంది. దాసీ వీరమ్మకు ఎవరు చెప్పారో తెలియదు. అదికూడావచ్చి పార్వతి పక్క కూర్చుని విసురుతోంది. ప్రసాదం సవతితల్లి కాళ్ల మీద తలఉంచుకొని రోదనం చేస్తున్నాడు. సీత ఒకమూల నిల్చుని ఏడుస్తూ అమ్మా! అమ్మా! అని అరుస్తోంది.

తండ్రి లోపలికి రాగానే ప్రసాదం ఏడుస్తూ అన్నా[illegible] "నాన్నగారూ! అమ్మ ఇహ బ్రతికదా?"

డాక్టరు సంగతి ఏమో గ్రహించి అందరినీ మాట్లాడ వద్దని ముక్కుమీద వేలుంచుకొని సౌంజ్ఞ చేశాడు. రోగిణి దగ్గిరకు వెళ్ళి పరీక్షించాడు. వెంటనే "ఏక్సిడెంటల్ బాక్సు" (తాత్కాలిక ఔషధ పేటిక) తీసి అందులోంచి ఒకసీసా తీసి అందులోఉన్న మందును వాసన చూపించాడు. తరువాత ఇంకొక సీసాలో ఉన్న మందు రెండుబొట్లు నాలుకమీద వేశాడు.

నాలుగైదు నిమిషములు దాటగానే పార్వతికి స్పృహ వచ్చింది. కన్నులు తెరచి చూచింది. ఇక భయంలేదని చెప్పి డాక్టరుగారు మందిచ్చి వెళ్ళిపోయాడు. పావుగంటకు పార్వతికి బాగా తెలివివచ్చి చూచింది. సవతికొడుకు ప్రసాదం తలదగ్గిర కూర్చుని విసురుతూ కళ్ళనీళ్ళు తుడుచు కొంటున్నాడు. ముఖం అంతా కందిపోయేటట్లు ఏడుస్తూ తనకు ఉపచారం చేస్తూన్న ప్రసాదాన్ని చూడగానే పార్వతికి ఆకస్మికంగా హృదయ సంచలనం కలిగింది. ఆమె లోగడ ఎన్నో నవలలు చదివింది. దేనిలోనూ మాతృహీనుడైన బాలుడు తన సవతి తల్లిని ఇంత గొప్పగా ప్రేమిస్తాడన్న విషయం ఆమెకు కనపడలేదు. ఊహించని, తలచని సన్నివేశం ఈదినం పార్వతికి కనపడగానే ఇదివరలో తానుచదివిన సంగతులు అసత్యాలేనా! అని అనుకొంది. తనకోసం సవతి కొడుకు ప్రసాదం, చిన్నపిల్ల సీత పడే ఆరాటం దుఃఖం చూడగానే ఆశ్చర్యపడుతూన్న ఆమె హృదయం ద్రవించింది.

శ్రీనివాసులు డాక్టరును పంపించివచ్చి భార్య దగ్గిర కూర్చుని "ఎట్లా ఉంది?" అని అడిగేడు.

పార్వతి జాలిగా కుమారుని చూసి ఒకటి రెండుకన్నీటి బిందువులు రాల్చింది. తరువాత భర్త ముఖాన్ని నిదానించి చూసింది. ఈనాడు ఆమె హృదయానికి తన పతి ఒక దైవ మూర్తిగా గోచరించాడు. ఇంతవరకూతాను అసూయతో చూచే ప్రసాదం ఆ దైవమూర్తికి తగిన కుమారుడుగా కనపడ్డాడు. లేచి రెండుచేతులతో ప్రసాదాన్ని కౌగలించుకోవాలనుకొంది బలహీనతచేత లేవలేకపోయింది, తల పైకెత్తి చూచింది. కాని ప్రసాదం అక్కడలేడు. "నాయనా! ప్రసాదం" అని పిలిచింది.

శ్రీనివాసులు దగ్గిరకు వచ్చి అన్నాడు. "అబ్బాయిని డాక్టరుగారి దగ్గిరకు పంపించాను. ఇప్పుడే వస్తాడు."

పార్వతి కన్నీరు తుడుచుకొంటూ భర్తతో ఇట్లా అన్నది. "నామాట వినండి. ఇంతవరకూ నేను లోకంలో సవతి కొడుకు తన పిల్లవాడౌతాడా! అనే భ్రమలో ఉన్నాను, దైవ స్వరూపులైన మీ పవిత్ర హృదయాన్ని అర్థంచేసుకోలేకపోయాను. బిడ్డడు ప్రసాదం నాకోసం ఎంత దుఃఖపడ్డాడో ఎంతసేవ చేశాడో అన్న సంగతి ఇప్పటికి తెలుసుకోగలిగేను. ఒకవేళ నేను చచ్చిపోతే ఎంత బెంగపడిపోయేవాడో అన్న భావం ఇప్పుడు స్ఫురిస్తోంది, ఆ భగవంతుడు ఈ రోగాన్ని నాకు శమకూర్చడం మూలంగా నా భ్రమ తొలగిపోయింది.

నా కన్నులు తెరిపిన పడ్డాయి." అంటూ కళ్ళనీళ్ళు పైట కొంగుతో తుడుచుకొంది.

శ్రీనివాసులు ఇట్లా అనుకొన్నాడు, "ఆపదలు మనుష్యులకు ఒరిపిడిరాళ్ళు, ఒరిపిడి రాతిమీద గీసినప్పుడుగాని బంగారపు విలువ ఎట్లా తెలియదో అదేవిధంగా మానవులకు కష్టాలు వస్తేగాని మంచిచెడ్డలు తెలుసుకోలేరు. హృదయం పరివర్తనంకాదు. తమ్ముతాము తెలుసుకొని ఎదుటివారిని అర్థంచేసుకొనే శక్తి ఆపదలు వచ్చినప్పుడే కలుగుతుంది."

అది మొదలు పార్వతి ప్రసాదాన్ని, సీతను తన కడుపున పుట్టిన బిడ్డలకన్న అధికంగా ప్రేమించింది. దానితోపాటు శ్రీనివాసుల ఇంటికి గతించిన లక్ష్మీప్రకాశం మళ్లా దినదినాభివృద్ధి పొందింది. అతనికాలం అంతా శాంతిగా గడిచిపోతోంది. ఒక్క నిమిషమైనా పార్వతి భర్తను పిల్లలను వదలిపెట్టి ఉండలేకపోతోంది.

---

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLAHOSB193 |
| పుస్తకం పేరు | Scanned |
| తారీఖు | 25/10/2016 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 67 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 64, ..., 11 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | prasad yadav |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |

మనసు ఫౌండేషన్